# వ్యాస మంజూష

సంకలనము

వి. ఎస్. హరినారాయణ్ M.A., M. Tech.

ప్రకాశకులు

దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర
959, ఖైరతాబాదు
హైదరాబాదు

# విజ్ఞప్తి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర ప్రధాన సర్వోదయ గ్రంథమాల పుష్పముగ "వ్యాస మంజూష" అను ఈ తెలుగు వ్యాస సంకలనమును ప్రచురించుచున్నాము ఆదినుండియు జాతీయభాష హిందీతో పాటు మాతృభాషా వికాసమునకు కూడా పాటుపడుట సభ లక్ష్యమై యున్నది ఈ లక్ష్యసాధన కొరకే ఆంధ్ర సభ తెలుగు గ్రంథములను ప్రచురించుచున్నది. 'స్రవంతి' సాహిత్య మాసపత్రికను గత 31 సంవత్సరములుగా అవిచ్ఛిన్నముగ నడుపుచున్నది.

గతములో వలెనే ఈ సంకలనము కూడ సాహిత్యాభిమానుల ఆదరము పొందగలదని విశ్వసించుచున్నాము.

ఈ సంకలనములో ప్రచురించిన వ్యాసకర్త లందరకు, సంకలన కర్తకు మా హృదయపూర్వక కృతజ్ఞతలను తెల్పుకొనుచున్నాము.

హైదరాబాదు
20-10-1984

గోదా తిరుమలయ్య
కార్యదర్శి

# విషయ సూచిక


భూమిక vi

1. చరిత్ర పూర్వయుగము
డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి 1

2. కౌటిల్యుడు అర్థశాస్త్రము
ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్య 18

3. ఆంధ్రప్రదేశ్ స్వరూపము-ప్రజలు
శ్రీ వై. వి. రమణ 28

4. 1857కు భూమిక
శ్రీ పడాల రామారావు 36

5. జాతీయ నిర్మాణము
డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య 44

6. సంస్కృతి
శ్రీ మేకా రంగయ్యప్పారావు 52

7. కందుకూరి వీరేశలింగంపంతులు
శ్రీ ఆరుద్ర 68
8. పౌరత
శ్రీ గొల్లపల్లి నాగభూషణశర్మ 86
9 సంఘంలో మార్పు—శాస్త్రీయ దృక్పథము
డాక్టర్ సి. లక్ష్మన్న 100
10. జీవితం—సాహిత్యం
శ్రీ కాళోజీ నారాయణరావు 108
11. రచయిత బాధ్యత
శ్రీ గోరాశాస్త్రి 118
12. రచనల్లో సామాజిక స్వరూపం
శ్రీ కొడవటిగంటి కుటుంబరావు 134
13. తెలుగు విమర్శ
డాక్టర్ శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం 141
14. భాషలో మార్పు
డాక్టర్ చేకూరి రామారావు 157

# భూమిక

వ్యాసం ఒక విశిష్టమైన సాహిత్య ప్రక్రియ. అమర కోశంలో "విస్తారో విగ్రహో వ్యాసః" అని చెప్పడం జరిగింది. విస్తారంగా, విభజించి చెప్పడాన్ని వ్యాసం అనడం వల్లనే ఈ శబ్దం విరివిగా వాడుకలోకి వచ్చింది

అయితే వ్యాస ప్రక్రియకు బీజరూపాలు మన సాహిత్యంలో ముందుగానే ఉన్నప్పటికీ ఆంగ్ల సాహిత్య ప్రభావం వల్లనే నేడు మనం చూస్తున్నరూపాన్ని వ్యాసం సంతరించుకొన్నది.

నిజానికి ఫ్రెంచి రచయిత మోన్‌టేన్ (1533-1592) నేటి వ్యాసానికి ఆద్యుడు తన గురించి వ్యాసం వ్రాస్తూ మోన్‌టేన్

I speak unto paper as unto the first man అని తనను గురించి తనకు సమగ్రంగా తెలుసుకనుకనే తనను గురించి వ్రాస్తున్నట్లు చెప్పుకొన్నాడు.

1580 లో మోన్‌టేన్ వ్యాసాలు ఫ్రెంచి భాషలో వెలువడగా 1593లో ఇంగ్లీషులో వెలువడ్డాయి.

మోన్‌టేన్ తన ప్రక్రియని ESSAI అన్నాడు. ESSAI అంటే ప్రయత్నం అని అర్థం. అంటే ప్రయత్నం అనేది అసంపూర్ణంగా, అవైజ్ఞానికంగా, అస్తవ్యస్తంగా కూడా ఉండడానికి వీలున్నది.

ఫ్రాన్సిస్ బేకన్ (1561-1626) అప్పటికే కొన్ని వ్యాసాలు వ్రాసినా 1612 వరకు ఆయన వ్యాసాలు వెలుగు చూడలేదు. ఆధునిక వ్యాసం ఈయన తోనే ప్రారంభం అయిందని అంతా ఒప్పుకొన్న విషయం.

అయితే బేకన్ మటుకు ESSAI అనగా ప్రయత్నం అనే అర్థాన్ని స్వీకరించక ESSAY అనే పదానికి మౌలిక రూపమైన EXAGIUM అనే లాటిన్ శబ్దం యొక్క 'తూచుట' అర్థాన్ని స్వీకరించాడు.

ESSAY అన్న శబ్దానికి రేండమ్ హౌజ్ డిక్షనరీ చెప్పిన అర్థం ఇలా ఉంది. 1. A short literary Composition on a particular theme or subject usually in prose and generally analytic, speculative, or interpretative 2 an effort to perform or accomplish something, attempt.

అయితే ఎస్సే అన్న శబ్దానికి చాలామంది చాలా అర్థాలు చెప్పడం జరిగింది. వాటిని ఒకసారి పరిశీలిస్తే వ్యాసం అంటే ఏమిటో బాగా బోధ పడగలదు.

The most delightful airy mould of thought which admits of every literary grace and every high quality of mind compatible with its essential smallness of scale - అని ఓ విలియమ్స్ వివరించాడు

A light gossipy article on a topical subject అని అన్‌బోర్న్ తేల్చి వేయగా A genuine expression on an original personality - an artful and enduring kind of talk అని రెండు విరుద్ధ లక్షణాల్ని జోడించడానికి జె. బి. ప్రీస్ట్లీ ప్రయత్నించాడు.

విలియమ్స్ చెప్పిన పరిభాషలో ఉల్లాసవంతమైన వాతావరణము. మేధస్సు యొక్క ఔన్నత్యము, సాహిత్యపరమైన ఉదాత్తత- ఈ మూడు పదబంధాలు ముడిపడని సంగతి ఇట్టే గుర్తించవచ్చు

ఆచార్య రామచంద్ర శుక్ల్ निबंध गद्य की कसोटी है అన్నాడు. एक एक पैरा में विचार दबा-दबाकर ठूंसे गये हों और एक एक वाक्य किसी संबद्ध विचार खण्ड के लिए हो ।– అని గొప్ప వ్యాసానికి ఉండవలసిన లక్షణాల గురించి ఆయన అభిప్రాయం.

निबंध उस गद्य रचना को कहते हैं, जिसमें एक सीमित आकार के भीतर किसी विषय का वर्णन या प्रतिपादन एक विशेष निजीपन, स्वच्छन्दता, सौष्ठव और सजीवता तथा आवश्यक संगति और सम्बद्धता के साथ किया गया हो । ఇది గులాబ్‌రాయ్ వ్యాసానికి చెప్పిన పరిభాష. సీమితమైన ఆకృతి, ప్రత్యేకమైన వ్యక్తిత్వం, స్వచ్ఛందత, సౌష్ఠవము, సజీవత్వం- ఇవి వ్యాసానికి ముఖ్యలక్షణాలని ఆయన ఉద్దేశ్యం.

మహోద్దండుడు డాక్టర్ జాన్సన్ వ్యాసానికి చెప్పిన పరిభాషను పరిశీలిద్దాము.

Essay is a loose sally of mind, an irregular' indigested piece not a regular and orderly performance.

'నిబంధ్' అంటే చక్కగా బంధింపబడినది అని సంస్కృతంలో ఉత్పత్తి అర్థం. అయితే తులసీదాసు రామచరిత్ మానస్‌ను 'భాషానిబంధమ్' అన్నాడు. మొదట్లో పద్యరచనల్ని కూడా వ్యాసంగా స్వీకరించినా రానురాను గద్యరచనల్ని మాత్రమే వ్యాసంగా పరిగణించ సాగారు.

తెలుగులో వ్యాసం అన్నపదానికి విరివి, ఏదేని ఒక విషయమును విరివిగా వ్రాయుట అని శబ్దరత్నాకరం అర్థం చెబుతున్నది.

వస్తువు గురించి అభిప్రాయాల్లో సారూప్యత, సామీప్యత ఉన్నా శైలి విషయంలో, ఆకారం విషయంలో అభిప్రాయాలు ఉత్తర దక్షిణ ధ్రువాలుగా ఉన్న సంగతి కొంత గందరగోళాన్ని కల్గించడము సహజమే.

**निबंध वह छोटी ललित गद्य रचना है, जिसमें विषय-प्रतिपन्नता के साथ हृदय का निर्बन्ध विचरण हो-** అని డాక్టర్ మోహన్ అవస్థి చెప్పిన పరిభాష.

రచనా వ్యాసంగానికి కొత్తగా పూనుకోదలచిన వారికి శ్రీతిరుమల రామచంద్ర సూచించిన ఈ పద్ధతి సుబోధకము.

1: అతి దీర్ఘంగా ఉండరాదు, సంగ్రహంగా, క్లుప్తంగా ఉండాలి. 2. వక్తవ్యాంశం విషయ విభాగంతో ఉండాలి 3. ప్రత్యేక శీర్షికలు ఉండాలి 4 విషయోద్దేశం నిర్దిష్టంగా ఉండాలి 5, భాషనిర్దుష్టం, సులభగ్రాహ్యం అయి ఉండాలి. 6 ఉపక్రమ, ఉపపాదన, ఉపసంహారాలు క్రమంగా పాటించాలి.

వ్యాసరచయిత కథకుడుకాదు. నాటకకర్తకాదు, వేదాంతికాదు, కవికాదు, చరిత్రకారుడు కాడు, ఆర్థికవేత్తకాదు, రాజకీయవేత్త కాదు-కాని అన్ని గుణాలు ఉంటాయి. అనేక విషయాలను ఎన్నుకొని, వివిధ

శైలీ విన్యాసాలతో పాఠకుణ్ణి ఆకట్టుకొని బోధించే బోధకుడు వ్యాస రచయిత. రమ్యంగా విషయాన్ని విపులీకరిస్తాడేకాని బోధిస్తున్నట్లు ప్రకటించడు వ్యాసకర్త.

## 2

వ్యాసం యొక్క ముఖ్య తత్వాలను ఈ విధంగా చెప్పవచ్చు.

*1. ఏకసూత్రత* : ఒక విషయాన్ని ఎన్నుకొని వ్యాసం వ్రాస్తున్నపుడు ఆ వ్యాసంలో ఇతర విషయాల జోలికి పోకుండా, పాఠకుని దృష్టిని చెదిరిపోనీకుండా ఒకే విషయం మీద కేంద్రీకృతమయే విధంగా సాగాలి. వ్యాసం చదివిన తర్వాత ఎన్నుకొన్న శీర్షికకు సంబంధించిన విషయాన్ని సమగ్రంగా తెలుసుకోగల్గాననే తృప్తి పాఠకునికి కలగాలి.

*2. వ్యక్తిత్వం* : రచయిత తనుఎన్నుకొన్న విషయాన్ని గురించి క్షుణ్ణంగా పరిశోధన చేసి విషయాన్ని పూర్తిగా ఆకళించుకొని నిజాయితీతో పాఠకుని మనస్సులో హత్తుకుపోయే విధంగా విషయాన్ని విశదీకరిస్తూపోవాలి. ఇక్కడే రచయిత తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించవలసి ఉంటుంది. విషయానికి అనుగుణమైన శైలిని రచయిత వాడాల్సి ఉంటుంది. మొదలు పెట్టిన వ్యాసాన్ని మధ్యలో ఆపకుండా చదివించ గల్గడమే రచయితకు నిజమైన పరీక్ష.

*3. శైలి* : భాష, వ్యాకరణము, పదబంధాలు వాక్యవిన్యాసము, మాటల ఎంపిక, ప్రవాహము - ఇవన్నీ కలిసి రచన ముందుకు సాగుతుంది. శైలిని అనుకరించడము మామూలు రచయితలు చేస్తారు. చాలా మంది రచయితలకు తమదంటూ ఒక శైలి ఉండదు. అయితే గొప్ప రచయితలందరికీ తమ ప్రత్యేక శైలి ఉంటుంది.

నాలుగు రకాలుగా శైలిని విభజించవచ్చు.

1. వ్యాస శైలి
2. సమాస శైలి
3. ధారాశైలి
4. తరంగ శైలి

వర్ణనాత్మక, వివరణాత్మక వ్యాసాలకు వ్యాసశైలిని ఉపయోగిస్తారు. అధ్యాపకుడు బోధించినట్లు పాఠకునికి అర్థం అయేలా విషయాన్ని విశదీకరిస్తూ వ్యాసాన్ని నడిపించుట ఈ వ్యాస శైలిలక్షణం. రచయిత పాఠకుని స్థాయికి దిగివచ్చిమిత్రునివలె విషయాన్ని విడమర్చి చెపుతాడు ఆలోచనా ప్రధానమైన వ్యాసాలకు సమాసశైలి కావలసి ఉంటుంది సమాస శైలిలో పదాలను మితంగా వాడుతారు. పదాలను తూచి తూచి వేస్తారు. రచయిత పాఠకుని కన్న ఎత్తుగా పీఠం వేసుకుని కూర్చుంటాడు. రచయిత విద్వత్తు, భావగాంభీర్యము పాఠకుడిని చుట్టు ముట్టి వేస్తాయి. మళ్ళీ మళ్ళీ చదివితే తప్ప పాఠకుడు రచయిత మనోభావాల్ని అస్వాదించలేడు. ఒక్కొక్కవాక్యం చదివి మననం చేసుకొన్న కొద్దీ వ్యాఖ్యానం అవసరం ఏర్పడుతుంది.

భావప్రధానరచనల్లో మస్తిష్కానికన్న హృదయానికి ప్రాధాన్యత ఎక్కువ. హృదయోద్వేగంతో ధారాపాతంగా, జలపాతంలాగా భావాలు దూకుతూ వస్తే ధారాశైలి అనీ, మధ్య మధ్య వ్యవధానంతో కట్టలు కట్టలుగా భావప్రకంపనం జరిగితే తరంగ శైలి అనీ అంటారు.

*4. కళాత్మకత :* వ్యాసం రసహీనమైన సాహిత్యాంగం కాదు. రచయిత కౌశల్యాన్ని బట్టి అందులో రససాక్షాత్కారం జరుగుతుంది. తర తమ భేదాలున్నా రసమయం కాని వ్యాసాల జోలికి పాఠకులు పోరు. రాశి ఎక్కువైన కారణంగా వాసిగల వ్యాసాలు కూడా వరదలో కొట్టుకు

పోయే ప్రమాదం ఏర్పడుతూ ఉంటుంది. జాగరూకులైన పాఠకులు ఈ రెండు రకాల వ్యాసాల్ని ఇట్టే పసికట్టగలరు. వ్యాసం ఒక విశిష్టమైన సాహిత్యప్రక్రియ కనుకనే కళాత్మకతవ్యాసానికి అత్యవసరమైన లక్షణం.

*3*

ప్లేటో, అరిస్టాటిల్, సెనెకా, ప్లూటార్క్, సిసిరో - వీరి రచనల్లో వ్యాస లక్షణాలు ద్యోతకమైనా ఆధునిక వ్యాసానికికుండే అన్ని లక్షణాలు వీటిలో లేవు ప్లేటో, సిసిరో, సెనెకాల రచనల్లో కొన్ని మౌలిక లక్షణాలు అగుపిస్తాయి. కాని వీరి రచనల్లో తన్మయత్వం, ఆత్మీయత కొరవడ్డాయి.

అయితే ఆధునిక వ్యాసానికి బీజలక్షణాలు అరిస్టాటిల్ పాత్ర చిత్రణల్లో దర్శన మిస్తాయి. 'ఆదర్శమానవుడు' స్కెచ్‌ని వ్యాసం అనే, వీలున్నది. ఈ విధానాన్ని థియోఫ్రెస్ట్స అనుకరించడం జరిగింది. ఆతర్వాత సెనెకా వ్రాసిన నైతిక లేఖల్ని బేకన్ వ్యాసాలుగా స్వీకరించాడు.

ఫ్రెంచి భాషలో మోన్‌టేన్ వ్రాసిన వ్యాసాలు ఇంగ్లీషులో 1593 లో ప్రచురితంకాగా, ఫ్రాన్సిస్ బేకన్ (1561-1626) వ్రాసిన వ్యాసాలు 1612లో వెలువడడంతో వ్యాస ప్రక్రియ జనాదరణపొందింది. బేకన్ రచనల మీద ప్లేటో, అరిస్టాటిల్, సిసిరోల ప్రభావం కన్పిస్తుంది.

అరిస్టాటిల్ రచనల్లో చోటుచేసుకొన్న నైతిక భావాల ప్రభావం బేకన్ వ్యాసాలమీద విపరీతంగా ఉన్నవి. బేకన్‌వ్రాసిన ఒకొక్కవాక్యంలో 'గాగర్ మే సాగర్' అన్నట్లు ఒకొక్క పేరాగ్రాఫ్‌కు సరిపడే అర్థం నిబిడీకృతమై ఉంటుంది.

మోన్‌టేన్ లో ఆత్మనిష్ఠ సాక్షాత్కరిస్తే బేకన్‌లో వస్తునిష్ఠను, భావప్రాధాన్యాన్ని చూస్తాము. అయితే ఒకోసారి బేకన్ ఒక విషయం నుండి తప్పించుకొని మరో విషయంలోకి ప్రవేశించడం గమనిస్తాము.

ఒక్కొక్కసారి పరస్పర విరుద్ధ భావాల్ని ఒకే వ్యాసంలో ప్రకటించడం కూడా జరిగింది. బేకన్ స్వయంగా తన రచనా వ్యాసంగాన్ని 'డిస్పర్స్డ్ మెడిటేషన్' గా వర్ణించాడు.

అ్రబహమ్ కౌలీ (1618-1667) మొదటిసారి ఇంగ్లీషులో మోన్ టేన్ తరహా వ్యాసాల్ని వ్రాశాడు, ఎడిసన్ (1672-1719), స్టీల్ (1672-1729) పాత్రచిత్రణ పద్ధతిని ఎంతో కళాత్మకంగా తీర్చి దిద్దారు. వీరి వ్యాసాల ప్రభావం వల్లనే నవలారచన ప్రారంభం అయింది.

ఇంగ్లీషు వ్యాసం చార్లెస్ లాంబ్ (1775-1834) కలంద్వారా కళాత్మకంగా అత్యున్నతస్థాయికి చేరుకొన్నది. ఆత్మకథా విధానం, పాత్ర చిత్రణ, ఆత్మీయత, మార్మికత, సంభాషణావిధానం, వాగ్వైదగ్ధ్యం హాస్యము, కరుణ- వీటన్నిటి అద్భుత మిశ్రమంగా వ్యాసాన్ని తీర్చిదిద్దిన ఘనత లాంబ్‌కు దక్కింది.

గోల్డ్‌స్మిత్ (1728-1774) లాంబ్‌కన్న ముందుగా చక్కని వ్యాసాలు వ్రాశాడు. కార్లాయిల్ (1795-1881), మెకాలే (1800-1859) థేకరే (1811-1868) రస్కిన్ (1819-1900) ఎమర్సన్ (1819-1900) మేధ్యూ ఆర్నాల్డ్ (1822-1888) వీరంతా పుంఖాను పుంఖంగా వ్యాసాలు వ్రాసి వ్యాసానికి విరాట్‌రూపాన్ని సంతరింపజేయుటయే కాక సాహిత్య ప్రక్రియల్లో వ్యాసానికి గౌరవస్థానాన్ని కల్పించారు, లాంబ్ తర్వాత స్టీవెన్సన్ (1850-1894) పేరుకూడా చెప్పుకోక తప్పదు.

4

ఆంగ్లరాజ్యస్థాపనతో బాటు ఆంగ్ల భాషాధ్యయనం చేయవలసి వచ్చినందు వల్ల హిందీ రచయితలమీద ఆంగ్ల సాహిత్య ప్రభావం పడక తప్పలేదు. తత్ఫలితంగా హిందీలో 'నిబంధ్' అన్న పేర ఒక సాహిత్య ప్రక్రియ రూపొందింది. పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్లనే హిందీలో

వ్యాసం అవతరించిందని హిందీ గద్య సాహిత్యం గురించి సాధికారంగా చెప్పగల్గిన డాక్టర్ లక్ష్మీసాగర్ వార్ష్ణేయ్ అభిప్రాయం. భారతేన్దు హరిశ్చంద్రునికి పూర్వమే కొన్ని ప్రయత్నాలు జరిగినా హిందీలో ఆధునిక వ్యాసానికి ఆద్యుడుగా ఆయన పేరే చెప్పకోవాలి.

శివప్రసాద్ 'సితారేహింద్' రచించిన 'రాజా భోజ్ కా సప్‌నా' ను మొదటి వ్యాసంగా కొంతమంది పేర్కొన్నా ఇందులో కథానికా లక్షణాలు ఎక్కువగా ఉండడాన్ని గమనించ వచ్చును

భారతేన్దు ఒక యుగకర్త. నాటిసామాజిక పరిస్థితులు కూడా వ్యాసానికి బాగా దోహదం చేశాయి. అప్పటికే హిందీ గద్యము ప్రౌఢ దశకు చేరుకొన్నది. నాటి సామాజిక. రాజనైతిక, ఆర్థిక, చారిత్రక, ధార్మిక పరిస్థితుల కారణంగా అప్పటి రచయితలంతా వ్యాసాన్ని గొప్ప అస్త్రంగా వాడుకోగలిగారు. భారతేన్దు యుగం నాటి రచయితలంతా పత్రికా సంపాదకులో, పత్రికా రచయితలో కావడం గమనార్హం. సంఘసంస్కరణకు నాటి రచయితలంతా పూనుకోవడం నాటి చారిత్రిక ఆవశ్యకత కనుకనే ఆనాటి రచయితలంతా ప్రత్యేక పద్ధతిలో హాస్యాన్ని కటోక్తుల్ని, వ్యంగ్యాన్ని తగిన పాళ్లలో కలిపి పాఠకుల్ని ఆకట్టుకోవడం జరిగింది. భారతేన్దు (1850-1885) పండిత్ బాలకృష్ణ భట్ (1884-1914) పండిత్ ప్రతాప్ నారాయణ్ మిశ్ర్ (1856-1894) బద్రీనారాయణ్ చౌధరీ ప్రేమఘన్ (1855-1928) మొదలైనవారు తమ వ్యాసాలతో హిందీ సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు.

పండిత్ మహావీరప్రసాద్ ద్వివేదీ యుగంలో విమర్శనాత్మక వ్యాసాలవైపు మొగ్గు కన్పిస్తుంది. సంస్కృత పద భూయిష్ఠం కావడంతో బాటు సామెతల్ని, నానుడుల్ని వదులుకోవడం వల్ల ఈ దశలో వ్యాసం

ప్రజలకు దూరంగా వెళ్లడాన్ని గమనిస్తాము. ద్వివేదీ రచించిన 'ప్రభాత్' అన్న ఒక్కరచనను మాత్రం 'నిబంధ్' గా వర్గీకరించి మిగతా రచన లన్నింటినీ విమర్శకులు 'ప్రబంధ్' 'లేఖ్', అని వర్గీకరించారు. ద్వివేదీ సంపాదకత్వాన సాగిన 'సరస్వతి' పత్రిక హిందీ సాహిత్యానికి అందులో ముఖ్యంగా వ్యాసానికి ఒక ముఖ్యమైన వేదికగా ఉపయోగపడింది.

సర్దార్‌పూర్ణసింహ్(1881-1931) చంద్రధర్‌శర్మగులేరీ (1883-1922) బాలముకుంద్ గుప్త్ (1865-1907) పండిత్ మాధవ ప్రసాద్ మిశ్ర్ (1871-1907) ఈ నలుగురు వ్యాస కర్తలు తమ ప్రత్యేక శైలి కారణంగా హిందీ సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని పొందారు. సర్దార్ పూర్ణసింహ్ రచించిన మూడే మూడు వ్యాసాలు ఆయనకు ఎనలేని కీర్తిప్రతిష్టలు తెచ్చి పెట్టాయి. బాలముకుంద్ గుప్త్ 'బంగ్‌వాసీ' సంపాద కునిగా నాటి సామాజిక సమస్యల్ని ఎన్నుకొని తీవ్రమైన వ్యంగ్యంతో పాఠకుల్ని ఆకట్టుకొని ఆలోచింప చేశారు.

ద్వివేదీయుగం వారైనప్పటికీ ఆచార్య రామచంద్ర శుక్ల్ (1884-1940), పదుమ్‌లాల్ పున్నాలాల్ బక్షీ (1895— ) లకు హిందీ సాహిత్యంలో ప్రత్యేక స్థానం ఏర్పడింది. రచనల ద్వారా ఇతర రచయి తలకు వెలుగు చూపించిన కాంతిపుంజాలు వీరిరువురూ.

రమణీయతా ప్రధానమైన బక్షీ వ్యాసాలు చదువుతున్నపుడు గోల్డ్ స్మిత్, ఎడిసన్, స్టీల్ లు గుర్తుకు వస్తారు.

విశ్లేషణకు తీవ్ర అంతర్ దృష్టిని జోడించి పండిత్ రామచంద్ర్ శుక్ల్ హిందీ సాహిత్యక్షేత్రంలో ముఖ్యంగా విమర్శనా క్షేత్రంతో పసిడి పంటలు పండించారు. ఇంగ్లీషులో రామచంద్ర్ శుక్ల్‌తో సరి పోల్చగల

వ్యక్తి బేకన్ మాత్రమే. శుక్ల్ వ్యాసాలు బేకన్ వ్యాసాలకన్నా గొప్పవని డాక్టర్ మోహన్ అవస్థీ అభిప్రాయం ఇంగ్లీషు సాహిత్యం తప్ప ఇతరభాషా సాహిత్యాన్ని అధ్యయనం చేయకుండానే తీసివేసేవారు, కళ్లకు గంతలు కట్టుకొన్నవారు ఈ విషయాన్ని ఒప్పుకోకపోవచ్చుననికూడా అవస్థీ అభిప్రాయం.

శుక్లానంతర యుగంలో హజారీప్రసాద్ ద్వివేదీ (1907- ) గులాబ్ రాయ్ (1886-1963), రామవృక్ష బేనీపురీ (1902-1968), విద్యానివాస్ మిశ్ర్ (1925- ) ప్రముఖంగా కన్పిస్తారు హజారీ ప్రసాద్ ద్వివేదీ వ్యాసాలలో పాండిత్యము, అనుభవం, భావోద్వేగం ఉన్నప్పటికీ సరళమైన భాష, వ్యాసశైలి పాఠకుల్ని ఆకర్షిస్తుంది. గులాబ్‌రాయ్ విశ్లేషణ, బేనీపురీ వాక్చిత్రాలు మనోరంజకంగా ఉంటాయి.

5

తెలుగు సాహిత్యంలో తొలుత వ్యాసానికి మూలమైన క్రోడ పత్రాలు కన్పిస్తాయి. విషయ నివేదన, ప్రతిపాదన, వివరణ, ప్రతిపక్ష మత ఖండన, స్వమత స్థాపన ఉపసంహారలతో కూడిన ఈ క్రోడ పత్రాలు శాస్త్రవిషయాల వరకే పరిమిత మైనందువల్ల పండితులకు మాత్రమే పరిమితమై పోయాయి.

సామినేని ముద్దునారసింహ నాయనిం వారు రాజమండ్రిలో ఫస్ట్ క్లాస్ జిల్లా మున్సిఫ్‌గా పని చేశారు మచిలీపట్నం నుండి వెలువడిన హితవాది'(1842-47) పత్రికలో మొట్టమొదటిసారి సామినేనివారు ప్రమేయము' అన్న పేరుతో "కొన్ని విషయములు ప్రజలకు సుబోధక మగునట్లు ముద్రాక్ష రాంకితములు" చేసిరి. వీరు వ్రాసిన 8 ప్రమేయ ములను ఆయన కుమారులు సామినేని రంగప్రసాదు నాయనిం వారు 1862 లో 'హిత సూచని' అన్న పేరుతో 224 పేజీల గ్రంథంగా ప్రచు

రించారు, ఈ గ్రంథంలో విద్యాప్రమేయము, వైద్యప్రమేయము, సువర్ణ ప్రమేయము మనుష్యేతర జంతు సంజ్ఞా ప్రమేయము, రక్షః ప్రభృతి ప్రమేయము, మంత్ర ప్రమేయము, పరోక్షజ్ఞాన ప్రమేయము, వివాహ ప్రమేయము అన్న ఎనిమిది వ్యాసాలున్నాయి. "సాధారణమైన భాషయందు వాడుకలో నున్న రచనలో అంగీకరింప తగినవిగా నేను ఎంచుకొంటున్నాను" అని సామినేని వారు శిష్టవ్యావహారిక భాషలో ప్రమేయాల్ని రచించారు

విజయనగర వాస్తవ్యులైన పరవస్తు వేంకటరామానుజా చార్యులయ్యవారు (1822-1900) వ్యాసప్రక్రియ చేపట్టినవారిలో రెండవవారు. అయితే వీరు తమ వ్యాసాల్ని "సంగ్రహములు"గా పేర్కొన్నారు. వీరు 28 సంగ్రహాల్ని విడివిడిగా పుస్తకాలుగా అచ్చువేశారు. ఈ సంగ్రహాల్ని నాటి పత్రికల్లో కూడ అచ్చువేశారు

సామినేని వారి వ్యాసానికీ, పరవస్తు వారి వ్యాసానికీ శైలి, విషయం రెంటిలో మార్పు వచ్చింది పరవస్తు వారి శైలిని ఆ తర్వాత వీరేశలింగం పంతులుగారు అనుసరించినట్లు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారి అభిప్రాయం

18 వ శతాబ్దం ఉత్తరార్ధంలో బెంగుళూరులో 28 వ పదాతి పటాలపు బాలికా పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసిన జియ్యరు సూరిగారు ప్రాచీన వ్యాసకర్తగా పేర్కొనదగిన మూడవవ్యక్తి. 1875లో 'స్త్రీ కళాకల్లోలిని' ప్రచురించారు. 69 వ్యాసాలున్న 'స్త్రీ విద్యామణి' వీరి గ్రంథం, వీరేశలింగం గారిని ఎంతో ప్రభావితుల్ని చేసింది.

అనేక సాహిత్య ప్రక్రియలకు శ్రీకారం చుట్టిన వీరేశలింగం పంతులు గారు వ్యాసానికి తెలుగు సాహిత్యంలో పెద్దపీట వేశారు.

'వివేకవర్ధని', 'చింతామణి', 'సతీహిత బోధిని', 'సత్య సంవర్ధిని' పత్రికల్లో పుంఖానుపుంఖంగా వ్యాసాలు వ్రాశారు. దాదాపు నాలుగు వేల పుటల వరకు విస్తరిల్లిన వీరి వ్యాసాల్ని ఆరు భాగాలుగా పెద్దలు విభజించారు. మత నైతిక విషయాలు, సాంఘిక విషయాలు, రాజకీయాలు, శాస్త్రీయ విషయాలు, జీవిత చరిత్రాత్మకాలు, స్త్రీ విద్యా పునర్వివాహ విషయాలగురించి 1875 నుండి 1897 వరకు వ్యాసాలు రచించారు. తెలుగులో వ్యాసరచనకు ఉపక్రమించేముందు వీరేశలింగంపంతులుగారి వ్యాసాలు చదివి తీరాల్సిందే.

పంతులుగారి సమకాలికులలో కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి గారు పేర్కొనదగిన వారిలో ఒకరు. అల్పదోషమునైనను శా వ్య ము నందు సహింపక, విమర్శచేసేటప్పుడు, యమునికన్న ఎక్కువ నిర్ఘృణుడని పేరు పొందిన పండితుడు అని గిడుగు రామమూర్తి పంతులుగారి ప్రశంసకు పాత్రులు, అయితే ఈయన వీరేశలింగంగారి ప్రత్యర్థి.

"రహస్యదర్పణము" (1894) అన్న పేరుతో వైజ్ఞానిక వ్యాసాలను ప్రచురించిన వ్యాసకర్త మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ.

చారిత్రక పరిశోధనా వ్యాసాలవైపు తెలుగు వ్యాసాన్ని మళ్ళించిన వారు చిలుకూరు వీరభద్రరావు (1872-1939). 19వ శతాబ్దం చివరిలో రాబోయే శతాబ్ద సాహిత్య ఉద్యమానికి రాచబాట వేసిన, విజ్ఞాన సర్వస్వ విశ్వవిషయ జ్ఞాని కొమర్రాజు లక్ష్మణరావు.

ఈ రోజు వ్యాసానికి ఇంత ప్రాచుర్యం కల్గడానికి ముఖ్యకారణం పత్రికలు. మొదటి నుండి పత్రికల కారణంగానే వ్యాస ప్రక్రియ పెంపొందుతూ వచ్చింది.

"సత్యదూత" తెలుగులో వెలసిన తొలి (1835) పత్రిక. ఆతర్వాత వృత్తాంతిని (1840), వర్తమాన తరంగిణి (1842-57) సంబోధకౌముది (1852), దిన వర్తమాని (1861-68) హితవాది (1842-47), శ్రీయక్షిణి (1862-67) పత్రికలు వెలువడ్డాయి.

1864లో ప్రారంభమైన తత్త్వ బోధిని లో నైతిక, సాంఘిక సాహిత్య, విద్యా సమస్యల పై చక్కటి వ్యాసాలు వచ్చేవి.

మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులు గారి "ఆంధ్ర భాషా సంజీవని' (1871)లో సాహిత్య, సాంఘిక, రాజకీయాది సమస్యలు చర్చనీయాంశాలుగా ఉండేవి

బందరు నుండి వెలువడుతూ వచ్చిన 'పురుషార్థప్రదాయిని'(1872) కి ఉమారంగనాయకులు గారు సంపాదకులుగా ఉండేవారు పై రెండు పత్రికల మధ్య వాదవివాదాలు జోరుగా సాగేవి.

విశాఖపట్టణం నుంచి వెలువడిన 'సకలవిద్యాభివర్ధని'లో వైద్యము, అర్థశాస్త్రము మొదలయిన విషయాలపై వ్యాసాలు వచ్చేవి. ఈ పత్రిక లోనే పరవస్తువారు తమ సంగ్రహాలను ప్రకటించారు,

1874 లో మాసపత్రికగా ప్రారంభమై, పక్షపత్రికగా రూపొందిన 'వివేక వర్ధని' వీరేశలింగం పంతులు గారి ఆలోచనా విధానాల్ని ప్రచారం చేసేందుకు బాగా తోడ్పడింది. 20 సంవత్సరాల పాటు వెలువడిన ఈ పత్రికలో వీరేశలింగం పంతులు గారు 200 పైగా వ్యాసాలు వ్రాశారు.

లోకరంజని, సుధారంజని, బ్రహ్మాండ రంజని, విద్యన్మనోహారిణి, ప్రబంధ కల్పవల్లి, అముద్రిత గ్రంథ చింతామణి (1885), హిందూజన సంస్కారిణి (1885), చింతామణి (1891), సతీహితబోధిని (1887), బుధవిధేయి(1887), సత్య సంవర్ధిని (1887), శశిరేఖ(1892)

వైజయంతి (1894), విబుధ రంజని (1898) మొదలైన పత్రికలు అనేక విషయాలపై వివిధ రచయితల వ్యాసాలు ప్రచురించి తెలుగులో వ్యాస ప్రక్రియను విస్తృత పరచడమే కాక, కూలంకష చర్చలకు వ్యాసాన్ని అనువైన ప్రక్రియగా తీర్చిదిద్దాయి.

పోతం జానకమ్మ గారు తెలుగులో మొదటి వ్యాస రచయిత్రిగా పరిశోధకులు నిర్ణయించారు. శ్రీమదాంధ్ర భాషాసంజీవనిలో 1874 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో తన భర్తతో ఇంగ్లాండు వెళ్ళి వచ్చిన సందర్భమున విదేశ యాత్ర గురించి చక్కటి వ్యాసాన్ని వ్రాసినట్లు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు ఆర్యమత బోధిని (1918) లో వ్రాశారు.

వ్యాసం వికసించసాగింది. వీరేశలింగం ప్రభృతులు దీర్ఘ వాక్యాల్ని వాడుతూ వచ్చారు. ఈ వికసన కాలంలో వాక్యం నిడివి తగ్గసాగింది, సూటిగా హత్తుకునే విధంగా రచయితలు రచనలు సాగించారు.

కట్టమంచి రామలింగారెడ్డి గారు 'పాండిత్యము-అలంకారములు-సాదృశ్యము' అను వ్యాసాన్ని 'త్రిలింగ' లో ప్రకటించారు. ఆకారంలో చిన్నదైన ఈ వ్యాసం ఆలోచనలో మిన్నది. సంప్రదాయక వ్యాసాలపై తిరుగుబాటు చేసినట్లు తోచు ఈవ్యాసంలో ఎంతో శక్తివంతమైన వాక్యాలు కన్పిస్తాయి.

1910 లో దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు ఆంధ్రపత్రిక ప్రారంభించారు. 1912 లో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక వెలువడింది. కృష్ణాపత్రిక, త్రిలింగ, ఆంధ్ర భారతి మొదలైన పత్రికలు శరపరంపరలుగా ప్రచురించేవి.

'తెలుగు'నుండి 'త్రిలింగము' పుట్టిందని కొమర్రాజు లక్ష్మణరావు గారి వ్యాసము, క్రీస్తుశకము రెండవ శతాబ్దమున టాలెమీ త్రిలింగమన్న

శబ్దాన్ని వాడెను కనుక 'త్రిలింగము' నుండి తెలుగు పుట్టిందని కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్యాస, ప్రతివ్యాసములు వ్రాసిరి.

అరసున్నలు, బండిరాలు గురించి కొంతమంది విమర్శనా వ్యాసాలు వ్రాస్తూండగా వ్యావహారిక భాషావాదాన్ని బలపరుస్తూ కొంతమంది వ్యాసాలు వ్రాశారు.

"సామాన్య జనులు పామరులు. నా బిడ్డలలో 199 లక్షలు వీరే. వీరి నిమిత్తము కల్పింపబడే గ్రంథాలు వాడుకభాషలోనే వుండవలెను" అని రెంటాల సుబ్బారావుగారు 1914లో వ్రాశారు. అర్థానుస్వార శకట రేఫ సంధి త్యాగము వల్ల భాషకు కలిగే నష్టాల్ని కాశీ కృష్ణాచార్యులు గారు 1912లో తెలపగా 1914లో 'గ్రామ్యభాషకాదు వ్యావహారిక భాష' అని గర్జించారు గిడుగు రామమూర్తి పంతులుగారు. "తెలియని వారికి బోధపడేటట్లు చేయవలెనంటే నలుగురూ మాట్లాడుకునే భాషలో" వ్రాసి చెప్పవలసి ఉంటుందని గిడుగువారు గట్టిగా చెప్పిన కారణంగానే వ్యాసాలు వ్యావహారికభాషలో వెలువడసాగాయి.

సమాజము, అర్థశాస్త్రము, రాజకీయాలు, పరిపాలన ఇత్యాది అంశాల్ని చేరదీసిన వ్యాసకర్తలు లెక్కకు తక్కువే మాడపాటి హను మంతరావు, భోగరాజు పట్టాభిసీతారామయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, మామిడిపూడి వేంకటరంగయ్యగార్లు వివిధ విషయాలపై వ్యాసాలు వ్రాయ సాగారు.

పత్రికా సంపాదకీయ వ్యాసాలకు ఉన్నతస్థానాన్ని కల్పించినవారు కృష్ణాపత్రికా సంపాదకులు ముట్నూరి కృష్ణారావుగారు.

ఏకశిలానగర మొరుగల్లే, చాళుక్యులు దాక్షిణాత్యులే, యుద్ధమల్లు బెజవాడ శాసనము, ప్రకృతిశాస్త్రము, కర్మయోగము, లలితకళలు మొద లైన వివిధ రకాల వ్యాసాలు రచించారు కొమర్రాజు లక్ష్మణరావుగారు.

గోలకొండ శోభ, సుజాత అన్న పత్రికలు 1920-30 మధ్య ప్రాంతంలో అమూల్యమైన వ్యాసాలు వెలువరించాయి.

నండూరి సుబ్బారావుగారి యెంకిపాటలను విమర్శిస్తూ బసవరాజు అప్పారావుగారు వ్యాసాలు వ్రాయగా, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు లాక్షణిక దృష్టితో యెంకిపాటల్ని తీసివేస్తూ వ్యాసరచన చేశారు. ఆ తర్వాత యెంకి పాటలలోని కవితా సౌందర్యాన్ని ఎత్తిచూపుతూ బూర్గుల రామ కృష్ణారావుగారు వ్యాసరచన చేశారు.

పానుగంటి వారి సాక్షి ఉపన్యాసములు చదవని వారుండరు. వారి చేతిలో వ్యాసశిల్పం అత్యున్నతస్థాయికి చేరుకొన్నది.

ఆంధ్రేతిహాస పరిశోధక మండలి 1922లో రాజరాజనరేంద్ర పట్టాభిషేకసంచిక, 1927లో కళింగదేశసంచిక ప్రచురించింది. నేలటూరి వేంకట రమణయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మ, వేటూరి ప్రభాకరశాస్త్రి, భావరాజు కృష్ణారావుగార్లు వ్రాసిన వ్యాసాలకు తెలుగు వారు ఋణపడి ఉన్నారు.

కట్టమంచి రామలింగారెడ్డి, వేలూరి శివరామశాస్త్రి, పింగళి లక్ష్మీ కాంతము, రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ, విశ్వనాథ సత్యనారాయణగార్లు తెలుగు సాహిత్యానికీ, తెలుగు వ్యాస సాహిత్యానికీ చేసిన సేవ మరువ గలమా ?

"సంప్రదాయాలను ధ్వంసం చేయడం కళాశీలికాక క్రీడకాదు. ఎంతో అవసరం కలిగి వీటి వినాశనంవల్లనే లోకాన్ని ముందుకు తీసుకు వెళ్లవలసి ఉంటుందన్నప్పుడే అతడిందుకుద్యమిస్తాడు." 1939లో శ్రీరంగం శ్రీనివాసరావు "తెనుగు కవిత కొత్తపోకడలు" అన్న వ్యాసంలో వ్రాసిన మాటలివి.

కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక మొదలైన అనేక సమకాలీన పత్రికలు చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారి వ్యాసాల్ని వదలకుండా ప్రచురించడానికి కారణం పాఠకుల ఆదరణ. చెళ్లపిళ్ల వారు వ్రాసిన వందలాది వ్యాసాల్ని అన్ని వర్గాల పాఠకులు వదలకుండా చదివేవారు.

భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనకు ముందు భమిడిపాటి, జొన్నలగడ్డ, మొక్కపాటి, కుందూరి ఈశ్వరదత్తు, కాటూరి, కురుగంటి, త్రిపురనేని, నేదునూరి, గడియారము వేంకట శేషశాస్త్రి పురిపండా, ఖండవల్లి, నార్ల వేంకటేశ్వరరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, జమ్మలమడక, దివాకర్ల వేంకటావధాని, బులుసు వేంకట రమణయ్య, దీపాల పిచ్చయ్యశాస్త్రి, చర్ల గణపతిశాస్త్రి, తిరుమల రామచంద్ర, నోరి నరసింహశాస్త్రి ఇంకా ఎందరో రచయితలు తమ వ్యాసాలతో తెలుగు సాహిత్యసేవ చేశారు.

స్వాతంత్ర్య సముపార్జనాంతర తెలుగు వ్యాసాన్ని పరిశీలించి శ్రీ కొలకలూరి ఇనాక్ తెలుగు వ్యాసాన్ని సృజనాత్మక వ్యాసం, విమర్శనాత్మక వ్యాసంగా విభజించారు. సృజనాత్మక వ్యాసాన్ని నాల్గువిధాలుగాను, విమర్శనాత్మక వ్యాసాన్ని 15 విధాలుగాను విభజించారు. అనగా నేటి తెలుగు వ్యాసాన్ని మొత్తం 19 రకాలుగా విభజించి పరిశీలించవచ్చును.

1. యుగవ్యాసం
2. స్త్రీవ్యాసం
3. పత్రికావ్యాసం
4. వివాదవ్యాసం
5. కావ్యతత్త్వవ్యాసం
6. కావ్యాత్మవ్యాసం
7. కావ్యగుణవ్యాసం

8. కావ్యాత్మవ్యాసం
9. కావ్యచరిత్రవ్యాసం
10. జీవిత చరిత్ర వ్యాసం
11. భాషావ్యాసం
12 అన్యభాషావ్యాసం
13. అనువాదవ్యాసం
14. పీఠికావ్యాసం
15. వేదాంతవ్యాసం
16. వైజ్ఞానికవ్యాసం
17. రాజకీయవ్యాసం
18. ఆర్థికవ్యాసం
19. పరిశోధన వ్యాసం

సృజనాత్మ వ్యాస ప్రక్రియ ద్వారా తెలుగు సాహిత్యంలో తిరుగు బాటు చేసినవ్యక్తి చలం. ఆనందం, విషాదం, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్ మొదలైన వ్యాస సంపుటాలు కళాఖండాలుగా రూపొందాయి.

క్రొంగొత్త ఆలోచనలకు కొత్త దృక్కోణాలనుండి ఆవేశంతో, వెలుగు ప్రసాదించిన వ్యక్తి శ్రీశ్రీ. తెలుగువ్యాసం వీరిద్దరికీ ఎంతో రుణపడి ఉంటుంది.

మొక్కపాటి నరసింహశాస్త్రి. మునిమాణిక్యం నరసింహారావు, కాటూరి వేంకటేశ్వరరావు, సంజీవదేవ్, కొడవటిగంటి కుటుంబరావు, బుచ్చిబాబు-వీరంతా సృజనాత్మక వ్యాసాలు వ్రాసిన వారిలో ముఖ్యులు.

స్వాతంత్ర్య కాంక్ష, ఆంగ్లవిద్య ఈ రెండి కారణంగా స్త్రీలు ముందంజ వేశారు. తత్పరిణామ రూపంగా స్త్రీలు వ్యాసాలు వ్రాయసాగారు 'ఊహాగానం', 'లతవ్యాసాలు' వ్రాసిన శ్రీమతి లత తెలుగు సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకొన్నారు. మాలతీ చందూర్, కె. రామలక్ష్మి, ఇల్లిందల సరస్వతీ దేవి వీరు స్త్రీ జీవితాన్ని వివిధ కోణాల నుండి పరిశీలించి అనేక వ్యాసాలు వ్రాశారు.

నేటి ప్రచారయుగంలో వార్తాపత్రికలు సంస్థలుగా రూపొందాయి. జరుగుతున్న సంఘటనలకు స్పందించి సంపాదకులు వ్రాసే సంపాదకీయాలు కూడా సృజనాత్మక వ్యాసాలుగా రూపొందాయి. ముట్నూరి కృష్ణారావు, కాశీనాధుని నాగేశ్వరరావు, నార్ల వేంకటేశ్వర రావు, గోరాశాస్త్రి, వీరి సంపాదకీయాలు తెలుగు సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని సంతరించుకొన్నవి.

ఇంగ్లీషు పత్రికల్లో కాలమిస్టులున్నట్లే ఒక్కొక్క శీర్షికతో వ్యాసాలు వ్రాసి పేరు ప్రఖ్యాతులు పొందినవారు చాలా మంది ఉన్నారు. విద్వాన్ విశ్వం, శివలెంక శంభుప్రసాద్, దాసు వామనరావు, రావూరి సత్యనారాయణ, తురగా కృష్ణమోహనరావు, లత, పురాణం సీత- వీరంతా ఈ కోవకు చెందిన వ్యాసరచయితలే.

శ్రీశ్రీ, విశ్వనాథసత్యనారాయణ గార్ల మధ్య సాహితీ వివాదం, రామాయణకల్ప వృక్షం గురించిన చర్చ, గ్రాంథిక వ్యవహారిక భాష, అభ్యుదయ విప్లవ కవితా ఉద్యమాలు, మొదలయిన వివాదాల కారణంగా వివాద వ్యాసాలు అనేకం వెలువడ్డాయి.

బుద్ధి ప్రధానమై, ఆలోచన రేకెత్తిస్తూనో, విషయం బోధిస్తూనో రచయిత హేతు దృష్టి నుంచి పుట్టి, అసంపూర్ణవిమర్శనంగా ఉంది, విజ్ఞాన

విస్తృతికి దోహద కారిగా రూపొందిన వ్యాసం విమర్శనా వ్యాసం అని కొలకలూరి ఈనాక్ నిర్వచించారు.

పిల్లలమర్రి హనుమంతరావు, జి వి కృష్ణారావు, ఆర్.యస్. సుదర్శనం పుట్టపర్తి నారాయణాచార్యులు మొదలయిన వారి కావ్యతత్త్వ వ్యాసాలు చెప్పుకోదగినవి. వేదము వేంకటరాయశాస్త్రి, కొండూరి వీరరాఘవాచార్యులు కావ్యాత్మ వ్యాసాలు వ్రాశారు. దీపాల పిచ్చయ్యశాస్త్రి, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, జాస్తి వేంకట నరసయ్య, డా॥ దివాకర్ల వెంకటావధాని, డా॥ కేతవరపు రామ కోటిశాస్త్రి కావ్య స్వరూప ప్రధానమైన కావ్యగుణ వ్యాసాలు వెలువరించారు. అనేక మంది ప్రముఖులైన తెలుగు రచయితల హృదయ పరిశీలనం చేస్తూ కావ్యాత్మ వ్యాసాలు వ్రాసిన వారు దేవు పల్లిరామానుజరావు. డా॥ బి. రామరాజు ఆచరణకు నోచుకోని జానపద సాహిత్యానికి, పేర్లులేని కవి శిల్పులకి గౌరవ ప్రతిష్ఠలు తెచ్చిపెట్టారు, కావ్యచరిత్ర వ్యాసాలరూపంలో విరివిగా రాలేదు

భాషాశాస్త్రం వైపు మొగ్గు చూపుట ఇటీవల ప్రారంభం అయింది. డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి, డా॥ జి, యన్. రెడ్డి, డా॥ తూమాటి దోణప్ప, డా॥ చేకూరి రామారావు వంటి ప్రముఖులు భాషావ్యాసాలు విరిగానే వ్రాస్తున్నారు. ఈ రంగంలో శ్రీ తిరుమల రామచంద్రగారి కృషి గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసి ఉంటుంది.

ఇంగ్లీషు, ఇతర భారతీయ భాషలనుండి తెలుగులోకి అనువదించిన వ్యాసాలు ఎక్కువే. రవీంద్రుడు, అరవిందుడు, ఎమ్.ఎన్ రాయ్ శరత్, ప్రేమచంద్, వంటి వారి భావస్రవంతిని తెలుగు వారికి అందించే లక్ష్యంతో అనువాద వ్యాసాలు వెలువడ్డాయి.

ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ, విస్సా అప్పారావు వసంతరావు వేంకట రావుల తెలుగులో వైజ్ఞానిక వ్యాసాలు వ్రాశారు తెలుగులో రావలసినన్ని వైజ్ఞానిక వ్యాసాలు రాలేదు.

పత్రికల కారణంగా ఇటీవల రాజకీయ, ఆర్థిక వ్యాసాలు వస్తున్నవి. అయితే మౌలికమైన తెలుగు వ్యాసాలు నేటికీ తక్కువే వైజ్ఞానిక, రాజకీయ, ఆర్థిక వ్యాసాలు తెలుగులో విరివిగా రావలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

విశ్వవిద్యాలయాలలో జరుగుతున్న భాషా, సారస్వత విషయాలకు మాత్రం సీమితమైన పరిశోధనావ్యాసాలు విస్తృతి చెంది, ఇతర విషయాల వ్యాసాలు వ్రాసేవారు, ప్రచురించేవారు, చదివేవారు తెలుగులో పెరగాల్సి ఉంది

భాష, సాహిత్యము మాత్రమే జీవితమన్న ధోరణి మారి ఇతర సామాజిక శాస్త్ర విషయాలపై వ్యాసాలు తెలుగులో వ్రాసేవారు పెరగాలంటే ప్రభుత్వము, సంస్థలు, పత్రికలు అంతా తగిన కృషి చేయాలి. పాఠకులు, ప్రచురణ కర్తలు ఇటువంటి వ్యాసాల్ని ఆదరించాలి. లేకపోతే తెలుగు పాఠకులు ఇతర భాషా వ్యాసాలపై ఆధారపడాల్సిన పరిస్థితి మారదు

## 6

ఈ వ్యాస సంకలనములో మొత్తం పధ్నాలుగు వ్యాసాలున్నవి. వీటిలో చివరి ఐదు వ్యాసాలు సాహిత్య వ్యాసాలు.

"చరిత్ర పూర్వయుగము" అనువ్యాసములో డాక్టర్ గిడుగు వేంకటసీతాపతి మానవోదయమైన నాటి నుండి లిఖిత పూర్వకమైన ఆధారముగల చరిత్ర మొదలయినంత వరకు చారిత్రక విశేషాల్ని వివరిస్తూ వ్రాశారు. వ్యవహారిక భాషా ఉద్యమానికి గిడుగువారు చేసిన సేవ

మరువ రానిది. ఈ వ్యాసాన్ని ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము కొరకు సీతా పతి గారు వ్రాశారు.

చివరి క్షణము వరకు ఆచార్య మామిడి పూడి వేంకట రంగయ్య గారు వందలాది పరిశోధనా వ్యాసాల్ని పరిశీలించి డాక్టరేట్లకు అర్హమైన వాటిని ఎన్నుకోవడం జరిగింది. "కౌటిల్యుని అర్థశాస్త్రము" అను గ్రంథాన్ని మామిడిపూడివారు రచించారు. ఈ సంకలనము కొని వ్యాసములో బహుప్రాచీనమైన అర్ధశాస్త్రము గురించి, కౌటిల్యుని గురించి అనేక వివరములు గలవు.

ఆంధ్రప్రదేశ్ భౌగోళిక స్వరూపము, ఇక్కడి ప్రజలు చారిత్రక విశేషాలను "ఆంధ్రప్రదేశ్ స్వరూపము- ప్రజలు'' వ్యాసములో శ్రీవై.వి. రమణగారు చక్కగా విశదీకరించారు.

భారతస్వాతంత్ర్య సమర చరిత్ర అను పరిశోధన గ్రంథంలో వందలాది స్వాతంత్ర్య సమర వీరుల గాథల్ని శ్రీ పడాల రామారావు గారు సంపుటీకరించారు. సిపాయీల తిరుగుబాటుగా చరిత్ర పుటలకెక్కిన అధ్యాయానికి భూమిక ఏమిటో "1857కు భూమిక " అనే వ్యాసంలో చక్కగా వివరించారు శ్రీ పడాల.

విదేశీయుల దోపిడీకి గురిఅయిన భారతదేశం ఆర్థిక, సాంస్కృతిక రాజకీయ, సామాజిక రంగాల్లో ఏ విధంగా ఛిన్నాభిన్నమైనదీ, రాజారామ మోహన రాయలు వంటి వ్యక్తులు జాతీయ నిర్మాణానికి ఏ విధంగా కృషిచేసిందీ "జాతీయ నిర్మాణము"అను వ్యాసంలో డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య వివరించారు. "కాంగ్రెసుచరిత్ర" అను గ్రంథము నుండి ఈ వ్యాసాన్ని ఎన్నుకోవడం జరిగింది.

భారతీయ సంస్కృతి, కళల గురించిన ముఖ్యమైన విషయాల్ని పాఠకుల కందించే ఉద్దేశ్యంతో శ్రీ మేకా రంగయ్యాప్పారావుగారు రచించిన "సంస్కృతి" అను వ్యాసాన్ని ఈ సంకలనములో చేర్చడం జరిగింది.

కవిగా ప్రఖ్యాతులైన శ్రీ ఆరుద్ర తెలుగు సాహిత్య చరిత్రను సాధికారంగా సంపుటీకరించారు. కందుకూరి వీరేశలింగంపంతులు గారి బహుముఖ ప్రతిభను, సాఫల్యాలేకాక వారివైఫల్యాల్ని కూడా శ్రీ ఆరుద్ర ప్రస్తుత వ్యాసంలో చక్కగా విశదీకరించారు.

నేటి, రేపటి పౌరులందరికీ తెలియని, తెలుసుకోవలసిన అనేక, ప్రాథమిక విషయాల్ని శ్రీ గొల్లపల్లి నాగభూషణశర్మ "పౌరత" అను వ్యాసంలో తెలియపరచారు. వారు ఈవ్యాసాన్ని ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము కొరకు వ్రాశారు.

కాలంతో బాటు సంఘంలో మార్పు వస్తుందనీ, శాస్త్రీయ దృక్పథముతోడయినపుడే సంఘంలో అభిలషించదగ్గ మార్పులు వస్తాయనీ డాక్టర్ సి. లక్ష్మన్న తమ వ్యాసంలో అంటున్నారు.

కాలంమారినా సంఘంలో మార్పురాకూడదని యథాస్థితి వాదులు వాదిస్తూనే ఉంటారు. ఈ వ్యాసాన్ని యువభారతివారి 'రచన' నుండి ఎన్నుకోవడం జరిగింది.

సువిఖ్యాత కవి శ్రీ కాళోజీ నారాయణరావు జీవితం సాహిత్యాన్ని ప్రభావితం చేస్తుందా, సాహిత్యం జీవితాన్ని ప్రభావితం చేస్తుందా, రచయితకీ సామాన్యునికీ గల తేడాలు ఏమిటి, రచయిత కట్టుబడితే ఏమి జరుగుతుంది, రచయిత సాధించగల్గింది ఏమిటి, సాధించలేనిది ఏమిటి మొదలైన ప్రశ్నలకు సూటిగా సమాధానాలు చెప్పారు "జీవితం - సాహిత్యం" అన్న వ్యాసంలో.

ప్రముఖ పాత్రికేయులు శ్రీ గోరాశాస్త్రి రచయిత ఎవరికి బాధ్యుడు అనే ప్రశ్నకు సమాధానాన్ని సోదాహరణంగా విపులీకరించారు. ఇది పరిశోధనా వ్యాసంకాదు, పరిశీలనావ్యాసం మాత్రమే అంటూ ఇందులోని భావాలను సవాల్ చేసేవారికి సమాధానంగా వెయ్యి పేజీల పరిశోధనా గ్రంథాన్ని వ్రాయుటకు సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించారు. కాని ఇక ఇప్పుడా అవకాశంలేదు.

ప్రేమలేఖల వెనకకూడా సామాజిక శక్తులున్నవనీ, నాటినుండి నేటిదాకా జరిగిన రచనలన్నీ జీవితానికీ సమాజానికీ సంబంధించినవనీ, సామాజిక నిర్మితిని అర్థం చేసుకోకుండా వ్రాసే రచయితలు నేలవిడిచి సాముచేస్తున్న వారితో సమానమనీ, ప్రస్తుత ధనస్వామ్య వ్యవస్థ మారాలనీ, మారడానికి రచయిత దోహదం చేయాలనీ అంటున్నారు, పుంఖానుపుంఖంగా చైతన్య రచనలు చేసిన రచయిత శ్రీ కొడవటిగంటి కుటుంబరావు "రచనల్లో సామాజిక స్వరూపం" శీర్షికగల వ్యాసంలో.

తెలుగులో మంచి విమర్శ రావడం లేదనీ, విమర్శకు నిష్పాక్షికమైన నిర్మాణాత్మకమైన, సహృదయ భావం మూలబీజమనీ, తెలుగులో నూతన విమర్శశకం రూపుకడుతున్నదనీ సమ్యక్ దృష్టితో పరిశీలించారు డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం "తెలుగు విమర్శ"లో.

భాషలో వచ్చే మార్పులకూ, ఆర్థిక శక్తుల వల్లవచ్చే మార్పులకూ సంబంధం లేదని సమాజంలో వచ్చే మార్పులకు విలువలు ఉంటవనీ, భాషలో వచ్చే మార్పులకు విలువలు ఉండవనీ అంటున్నారు భాషాశాస్త్రవేత్త డాక్టర్ చేకూరి రామారావు. ఇంగ్లీషు అంతర్జాతీయ భాష ఏ

విధంగా కాగల్గింది, ఆధునిక వ్యవహారానికి తెలుగుభాష సమర్థవంతమైన వాహకంగా రూపుదిద్దుకోవాలంటే ఏమి చేయాలి, నేటి రచనా భాషగా వ్యవహారభాషనే ఎందుకు ఎన్నుకోవాలి- మొదలైన విషయాల్ని "భాషలో మార్పు"లో చర్చించారు డాక్టర్ చేకూరి. సాహిత్య వ్యాసాలను యువ భారతి వారి 'రచన', 'మహతి' లనుండి ఎన్నుకోవడం జరిగింది.

ఈ అవకాశాన్ని ఇచ్చిన దక్షిణ భారత సభ వారికి కృతజ్ఞతలతో

వి.యస్. హరినారాయణ్

# చరిత్ర పూర్వయుగము

## డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి

మానవుడు ఎప్పుడు ఎక్కడ మొట్టమొదట ఉద్భవించెనో సరిగా చెప్పలేము. ఒక్కచోటనే పుట్టి క్రమముగా ఇతర దేశములకు వ్యాపించెనో లేక ఏక కాలముననే పరస్పర సంబంధములేని వివిధ స్థలములందు పుట్టెనో చెప్పలేము. దేశాభిమానము కొద్దీ కొందరు తమ దేశమందే మొట్టమొదటి మానవుడుద్భవించెనని చెప్పుదురు ఆ విధముగానే మన వారు కొందరు మానవోదయము మన భారతదేశమందే జరిగినదని చెప్పి యున్నారు కాని, ఇదమిత్థమని నిర్ణయించి చెప్పుటకు తగిన నిదర్శనములు లేవు మానవోదయమయిన నాటి నుండి లిఖితపూర్వకమయిన ఆధారము గల చరిత్ర మొదలు పెట్టిన వరకును గల యుగమునకు చరిత్ర పూర్వయుగమని పేరు. ఆ చరిత్ర పూర్వయుగ విశేషములు మన భారత దేశములో ఎట్లుండెనో తెలియజేయగల ముఖ్యాధారములు అనగా : మానవుని పరికరములు, అస్థిపంజరము, మానవుడు భుజించి తినిన జంతువుల

ఎముకలు, కొమ్ములు, దంతములు మొదలైనవి అనేకము దొరికినవి. ఈ వస్తువులు కనబడిన ప్రదేశము లందలి భూతల లక్షణము ప్రధాన మయిన విషయము. దానినిబట్టి దొరికిన వస్తువులు ఏయే కాలములనాటివో చెప్ప గలము. ఇందుకు భూగర్భ శాస్త్రము, జంతుశాస్త్రము, మనుష్యశాస్త్రము మొదలగు శాస్త్రములు మనకు తోడుపడగలవు.

## చరిత్ర పరిశోధనారంభము

క్రీ. శ. 1865లో రాబర్ట్ బ్రూస్‌పుట్ మనదేశమందు గల చరిత్ర పూర్వయుగ మానవ పరికరములలో మొట్టమొదటివని చెప్పదగిన వస్తు వులను చెంగల్పట్టు జిల్లాలో కనుగొనెను. మరికొందరు మరికొన్నిచోట్ల మరికొన్ని వస్తువులు కనుగొనిరి. కాని, క్రీ. శ. 1920 వరకు శాస్త్ర దృష్టితో వీటి పరిశోధన జరుగలేదు. ఆ పిమ్మట శాస్త్రీయ పద్ధతిలో జరి గిన పరిశోధనల వలన ఇండియాలో కాశ్మీరదేశమందు సుమారు నాలుగు లక్షల సంవత్సరములకు పూర్వమే మానవుడు నివసించి యుండెనని తెలిసినది.

భూగోళ చరిత్ర విషయమున భూగర్భ శాస్త్రజ్ఞులు పేర్కొని యుండిన యుగములందు నాల్గవ యుగమునకు 'ప్లైయిస్టోసీన్' యుగమని పేరు. ఈ యుగమందే మానవు డుద్భవించెను. ఈ యుగము సుమారు ఆరులక్షల సంవత్సరముల పరిమితి కలది. ఈ యుగము నాటి మనదేశ నైసర్గిక లక్షణములను (Physical features) కొంత వరకు మనము ఊహింపవచ్చును.

## ఇండియాలో మానవుని అవతరణ

ఆ కాలములో కాశ్మీర ప్రదేశమందు శీతము అత్యధికమై ఉండెను: కనుక, భూతలమంతయు మంచు నదులుగా ఏర్పడి యుండెను. శీతము

తగ్గగానే మంచు నదుల (Glaciers) విస్తీర్ణత తగ్గుచుండెను. ఈ విధముగా నాలుగు హిమానీ నదకాలములు (Glacial Periods), మూడు హిమానీ నద విరామకాలములు (Inter- Glacial Periods) ఒకటి విడిచి మరియొకటి పర్యాయక్రమమున గడచినవి, అందు రెండవసారి వచ్చిన హిమానీ నదకాలమందు కాశ్మీరములో మానవుడు నివసించి యుండెనని చెప్పుట కాధారము కనబడినది.

గుజరాతులోను, మధ్య-ఇండియాలోను ప్రాచీన కాలమందు దట్టమైన అడవులుండేవి. అప్పుడు మనదేశ మందెక్కడను కనబడని జంతువులాకాలములో ఆ ప్రదేశములో ఉండేవి. అక్కడ కూడా శీతోష్ణస్థితి పెక్కుసారులు మారుచుండుటవలన అడవులు దట్టముగా నుండిన కాలము మారి, అడవులు తగ్గి పచ్చిక బయళ్ళు ఎక్కువయిన కాలము వచ్చుచుండెను. ఇట్లు పర్యాయక్రమమున కలుగు కాలపరివర్తనములకు శీతోష్ణకాల పరివర్తనములు (Climatic Cycles) అని పేరు. తూర్పు కోస్తాలోను, ఆంధ్రదేశమందును మూడు అతివర్షకాలములు (Pluvial Periods), రెండు వర్ష విరామకాలములు (Inter Pluvials) ఒకటి వెనుక నొకటిగా పర్యాయక్రమమున వచ్చినవి. ఈ శీతోష్ణ స్థితిపరివర్తనములు ఆనాటి నదీవిసర్జనముల (River Deposits) వలనను,నదిమట్టముల (Terraces) వలనను తెలియుచున్నవి. చరిత్ర పూర్వ యుగ మానవుడు నదీ తీరములందు నివసించి యుండుటచేత అతని పరికరములు నదీతీరములందు సాధారణముగ దొరకుచున్నవి.

## చరిత్ర పూర్వయుగ విభాగములు

మృగ పక్షులకు వాటి అంగములే పరికరములు; కాని, మానవుడు ప్రకృతిసిద్ధముగా మేధాశక్తి ఎక్కువగా కలవాడు గనుక, అతని పరికరములు కేవలము అతని అవయవములే కాదు. అతడు నిర్మించుకోగలిగిన

శరీరేతర అవయవములతోనే మానవుడు-తక్కిన జంతువులవలె సృష్టి ప్రాభవమునకు లొంగక-ప్రకృతిని జయింప గలిగినాడు. మానవుని నాగరకత అతడు పొందిన ప్రకృతి విజయమునుబట్టి వర్థిల్లుచున్నది. కనుకనే మానవుని పరికరములనుబట్టి చరిత్ర పూర్వయుగమును నాలుగు తరగతులుగా విభజింపవచ్చును: 1. ప్రాచీన శిలాయుగము (Paleo-Lithic) 2. మధ్య శిలాయుగము (Meso-Lithic) 3. నూతన శిలాయుగము (Neo-Lithic) 4. లోహ యుగము.

ఈ నాలుగు యుగభాగములును ఒక దానితో ఒకటి సంబంధము కలిగియున్నవి. మానవుని నాగరకతా పరిణామమును ఈ యుగములు సూచించుచున్నవి.

## ప్రాచీన శిలాయుగము

ప్రాచీన శిలాయుగ మందు మానవుడు జంతువులలో ఒక వింత జంతువై, నదీతీరములందును, పర్వతగుహ లందును సృష్టిలో దొరికిన దుంపలను, కాయలను, పండ్లను తినుచు జీవించుచుండెను. కర్రలతోగాని రాళ్లతోగాని పశులను, మృగములను చంపి వాటి మాంసము తిని, వాటి చర్మములను ధరించు చుండెను. ఈ కాలమందలి మానవుడు ఒక నిర్దిష్ట ప్రదేశమందు నివసించుచు, తనకు కావలసిన ఆహార పదార్థములు తాను సంపాదించుకోలేక మేతకోసము తిరుగాడు పశుపక్ష్యాదులవలెనే సంచరించుచుండెను. కనుక, అతని నాగరకత, ఆహారాన్వేషణ (Food-Gathering), స్థితిలో ఉండెనని చెప్పవచ్చును. అట్టి స్థితికి అనుగుణముగానే అతడు నదీ తీరములందు దొరికిన రాళ్ళతో మోటుగా తన పరికరములను తయారుచేసికొనుచుండెను రానురాను, అతని పరికరముల నిర్మాణము అభివృద్ధి పొందినది.

మొదట నదీతీరమందు నివసించిన మానవుడు తనకు దొరికిన వాడి మొనగల రాళ్ళను వాడుచుండెను. తర్వాత ఒక బల్లపరుపుగానున్న గులక రాతిని తెచ్చి, దాని చివరి భాగమును మరియొక రాతితో కొట్టి రెండు, మూడు తునకలు తీసివేసి వాడి మొన తయారుచేయుట నేర్చెను. కాశ్మీర మందలి ఆదికాలపు మానవుడు పైని చెప్పినట్లు తునుకలు కొట్టి వాడి మొనలు తయారు చేయుచుండెను. ఆ తునుకలలో పెద్దవి, రెండవ హిమానీనద కాలములో వాడుకయందుండెను. అతడు గులకరాతి పరికర ములను (Pebble Tools)కూడా వాడుకొను చుండెడివాడు. గుజరా తులో సైతము అటువంటి గులకరాతి పరికరములు దొరికినవి. ఆ గులక రాతిచే రెండువైపులను తునుకలు తీసి గుమ్మడిగింజ ఆకారము వచ్చునట్లు చేసి చేతి గొడ్డలిగా అక్కడివారు వాడుకొను చుండిరి. అట్టి చేతి గొడ్డళ్ళు సుమారు 2,50,000 సంవత్సరముల నుండి కాశ్మీరము మొదలు మధుర జిల్లా వరకును మనదేశమందు వాడుకలో ఉండినట్లు చరిత్రాత్మక నిదర్శన ములు కనబడుచున్నవి.

ఈ చేతిగొడ్డళ్ల నిర్మాణము క్రమక్రమముగా అభివృద్ధి పొందినది. మొట్టమొదట ఒకదాని ప్రక్క నొకటిగా తునుకలు రెండు ప్రక్కలను తీయుటచేత ఏర్పడిన మొనలు తిన్నగా గాక వంకరటింకరగా ఉండేవి. రానురాను మానవుడు తిన్నని మొనలు, రమ్యమయిన ఆకారములు గల గొడ్డళ్ళు మొదలయిన పరికరములను చేయగలిగెను బొరిగవలె వెడల్పు గాను, వాడిగాను ఉండు మరొక విధమైన ఆయుధము (Cleaver)ను కూడా తయారుచేసి వాడుకొనుచుండెడి వాడు

రాళ్ళతోనే కాక ఎముకలతో కూడా ఆ యుగమునాటి మానవులు తమ ఆయుధములను నిర్మించుకొనుచుండిరి. అట్టివి కర్నూలు జిల్లాలో బిల్లసర్గపు గుహలో దొరికినవి.

ఆ ప్రాచీన శిలాయుగము సుమారు క్రీ. పూ. 10,000 సంవత్స రముల నాటికి ముగిసిపోయినది.

## మధ్య శిలాయుగము

'ప్లెయిస్టోసీన్' యుగాంత మందు ప్రపంచ మందంతటను శీతోష్ణ స్థితిలో గొప్పమార్పు కలిగినది దాని కనుగుణముగా మానవుని పరికర ములలో కూడ మార్పు కలిగినది. ఆ యుగముల పరిశోధన మనదేశ మందు మొన్న మొన్నటి వరకును ఏమీ జరుగలేదు. కనుక, యూరప్ ఖండ దేశములందు ఎట్లు పరిశోధకులు అక్కడి శీతోష్ణస్థితి పరిణామము నకును, అక్కడి ఆయుధ నిర్మాణ పరిణామమునకు గల సంబంధము నిరూపింప గలిగినారో, అట్లు మనదేశమందలి శీతోష్ణస్థితి పరిణామము నకును, ఆయుధ నిర్మాణ పరిణామమునకును గల సంబంధము నిరూ పింపలేము కాని, సుమారు క్రీ. పూ 10,000 సం॥లనాటి మధ్య శిలా యుగపు రాతిపరికరములు గుజరాతులో దొరికినవి.

ఆ మధ్య శిలాయుగమునాటి మానవుడు గుజరాతులో సరస్సుల పరిసరములందును, నదీ తీరములందును చెకుముకిరాళ్ళతో చిన్న చిన్న పరికరములు చేసికొని జీవించుచుండెను ఆ కాలమున మానవులు తాము నివసించుచుండిన ప్రదేశములందే మృతిపొందిన తమ బంధువుల దేహము లను కాళ్లు చేతులు ముడిచి ప్రక్కకు త్రిప్పి పడుకోబెట్టి గోతులలో పాతి పెట్టుచుండిరి ఇద్దరి మానవుల అస్థిపంజరముల ప్రక్కను ఒక కుక్క అస్థిపంజరము కూడ దొరుకుటచేత ఆనాటి మానవులు కుక్కల వంటి జంతువులను మచ్చికజేసి పెంచుకొనుచుండిరని ఊహింప వచ్చును

వారు మృగములను వేటాడి చంపి, వాటి మాంసమును తిని వాటి ఎముకలతో తమకు కావలసిన పరికరములను చేసికొను చుండిరి. ఆ కాల

ములో గుజరాత్ దేశమందలి ఉత్తర భాగము ఇప్పుడున్నట్లు ఎడారిగా ఉండలేదని చెప్పుటకు ఆధారములు కలవు. అక్కడ ఖడ్గమృగముల ఎముకలు కనబడినవి; కనుక అక్కడ వర్షములు మెండుగా కురిసి దట్టమైన అడవులు పెరిగి యుండవలెను.

ఆ యుగమునాటి మానవుల పరికరములు కడుచిన్నవి. కనుక, వారి పరిశ్రమకు సూక్ష్మశిలా పరికర పరిశ్రమ (Microlithic-Industry) అని పేరు చెకుముకి రాళ్ళతో ఒక వైపు మొద్దుగాను, మరొక వైపు వాడిగాను ఉండే చిన్న చిన్న కత్తులను, నెలవంకలవలెను, త్రిభుజముల వలెను విషమ భుజములు గల చతుష్కోణముల వలెను రాతి తునకలు చెక్కి పలు విధములయిన ఇతర ఆయుధములను వారు తయారు చేసికొనుచుండిరి. అంతేకాక, సూది మొన గల పోగర (Graver of-Burin)ను సైతము వారు ఆనాడు వాడుచుండిరి.

గుజరాతు, కర్నూలు, బళ్ళారి, గోదావరి తిరునల్వేలి జిల్లాలలో చిన్నచిన్న రాతి పరికరములు కొన్ని దొరికినవి అవి ఈ మధ్యయుగము నాటివే !

## నూతన శిలాయుగము

కొంత కాలమునకు మానవుని జీవితచరిత్రలో ఒక గొప్ప మార్పు వచ్చినది. స్థిరనివాసము లేక, ప్రకృతి సిద్ధమయిన ఆహారము దొరికే స్థలములందును, నదుల లోయల లోను తిరుగుచుండు మానవుడు మేధాశక్తి గలవాడు గనుక, శీతోష్ణస్థితి కష్టములను గుర్తించి, ఎక్కడనైనా ఒక అనుకూలమైన చోట స్థిరనివాసము ఏర్పరచుకొనుట మేలని తలచెను. అంతట ఆహారాన్వేషణ పర్యటనము మాని, ఆహారోత్పత్తి చేసుకొనుటకు పూనుకొనెను. ఇట్లు స్థిరనివాసము ఏర్పడుట వల్ల సృష్టి వైపరీత్యములకు

లొంగిపోవలసిన దురవస్థ తప్పినది అనుభవము వలన నాటి మానవుడు నల్లరాతిముక్కలతో ఎక్కువ గట్టిగా ఉండే పనిముట్లు, పరికరములు, మట్టితో కుండలు, బానలు చేయుటకు మొదలిడినాడు దానితో నూతన శిలాయుగము ప్రారంభమైనది.

మనదేశములో నూతన శిలాయుగములో చెకుముకి రాళ్ళతోను, మరియొక రకమైన పెద్దరాతి ముక్కలతోను, పనిముట్లను చేయుచుండిరి. గుమ్మడిగింజ ఆకారమున చేతిగొడ్డళ్లను చేసి, వాటి అంచుల నరగదీసి నునుపు చేయుచుండిరి వీటిని మనదేశమందు ఆ కాలమువారు ఎట్లు వాడు కొనిరో స్పష్టముగా చెప్పలేము గాని, ఇతర దేశములందు కర్రలకు కన్నములు దొలిచి ఈ రాతిగొడ్డళ్ళను దూర్చి బిగించి వాడుకొనుచుండి నట్లు నిదర్శనములు కనబడినవి. మన దేశమందు ఉత్తరప్రదేశములో ఇటువంటి గొడ్డలి కనబడినది; కనుక, మనదేశములో కూడ ఆ విధము గానే కర్రకు రాతిగొడ్డలి అమర్చి వాడుకొనుచుండిరని చెప్పవచ్చును.

అంతేకాక - వీరు అనేక విధములయిన పరికరములు, ఆయుధములు చేసికొనిరి. ఒకవైపు నాగలి కర్రుగాను, రెండవ వైపు బల్లపరుపుగాను ఉండే గొడ్డలి తయారుచేసికొనిరి. కర్షకులకు కావలసిన పనిముట్లు డాన్యూబ్ నదీ తీరమందున్ను, మన దేశములో బళ్ళారి జిల్లాలోను, గుంటూరు జిల్లాలో అమరావతి మొదలయిన స్థలములందును పెక్కులు దొరికినవి. అంతేకాక, ఉలిని, త్రవ్వుటకు పనికివచ్చే చిన్నచిన్న పని ముట్లు మొదలయిన వాటిని చేయుటకు కావలసిన రాతితునకలు తీసే సాధ నములున్ను, మోటుగా ఉండే పెద్దకర్రున్ను, వాలుగల సుత్తిరాళ్లున్ను ఆ కాలమువారు నిర్మించుకొనుచుండిరి.

నూతన శిలాయుగము నాటి పరికరములు ఇంచుమించుగా మన దేశ మంతటను దొరికినవి. కాని దక్కను పీఠభూమిలో మధ్య

భాగమున్ను, హైదరాబాదు ఆగ్నేయభాగమున్ను, రాయలసీమ జిల్లాలున్ను ఆ నూతన శిలాయుగ నాగరకతకు కేంద్రము అని చెప్పవలెను. బళ్ళారి జిల్లాలోను, మైసూరు మండలమందు ఉత్తర భాగములోను. నూతనశిలా యుగ నాగరకత క్రీ. పూ. 8000 సంవత్సరముల వరకు వ్యాపించి యుండెను.

## లోహయుగము

మరి కొంతకాలమునకు మానవుడు తనకు కావలసిన పరికరములు, పనిముట్లు, ఆయుధములు, లోహములతో చేయుట కలవాటు పడినాడు అతడువాడిన లోహములలో మొదటిది రాగి; రెండవది కంచు. క్రమముగా లోహముతో చేసినవి ఎక్కువయి, రాతితో చేయటం తక్కువయినవి· తుదకు రాతితో రుబ్బురోలు, సన్నెకల్లు మొదలయిన వేవో కొన్ని పరికరములు తప్ప తక్కిన వన్నియు లోహముతో చేసికొనుచే అన్ని దేశాల లోను పరిపాటి యైనది. కాని, నూతన శిలాయుగము గడచి లోహయుగము పూర్తిగా వెలయుటకు కొన్ని వేల సంవత్సరములు పట్టినది. ఈ మధ్య కాలములో ప్రపంచము మందంతటను మానవుని జీవితము అనేక విష యములలో అభివృద్ధి పొందినది.

ఆయా ప్రదేశముల పరిస్థితులను బట్టి కొన్ని చోట్ల ఎక్కువగాను కొన్నిచోట్ల తక్కువ గాను జరిగినను మొత్తము మీద నాగరకతాభివృద్ధి జరిగినది.

నూతన శిలాయుగము నాటికే మానవుడు స్థిరనివాస మేర్పరచు కొన్నాడు. దానితో అతని భౌతిక వాంఛలు ఎక్కువయినవి. లోహము యొక్క విలువను గుర్తించి, లోహముతో తన పరికరములను నిర్మించు కొనుట ఆరంభము కాగానే మానవ సంఘములందు పరిశ్రమ ప్రత్యేక

(Specialization of Labour), పరిశ్రమ విభజనము (Division of Labour), మానవ సంఘములందు పరస్పరాశ్రయము (Inter-dependence) పరస్పర సహకారము ఎక్కువయినవి. ఈ పరిస్థితు లకు తగినట్లుగా సంఘముల విస్తృతి ఎక్కువయినది. సంఘములందు పరస్పర సాంఘిక, ఆర్థిక, వాణిజ్య సంబంధములుగల నగర సంస్కృ తులు (Urban Civilizations) ఏర్పడినవి

ఈ మధ్యకాలమందు మానవులు కొన్ని పరికరములు రాతి తోను, కొన్ని పరికరములు రాగి, కంచు, లోహముల తోను చేసికొనుచుండుట చేత వారి నాగరకతకు కాల్కొ-లితిక్ నాగరకత అని పేరు వచ్చెను. ఆ నాగరకత బెలూచిస్తాన్, ఝోబ్ లోయలనుండి సింధు మైదానమందం తటను, అరేబియా సముద్రము నుండి హిమాలయ పర్వతముల వరకును, సుమారు క్రీ.పూ. 3,000 నుండి కొంతకాలము పర్యంతము వెలసి యుండెను. ఆ ప్రదేశమందు కొన్ని నగరములు గొప్ప రాజ్యములుగాను, వాణిజ్య సంపదకు, నాగరకతకు కేంద్రములుగాను విలసిల్లినవి. ఆ నగ రములందే ఒకటి హరప్పా; మరియొకటి మొహంజదారో. ఈ మధ్య కాలములో ఆ నగరములందు వెలసిన నాగరకతకే సింధు నాగరకత అని పేరు.

## మొహంజదారో లోని ప్రాచీన సంస్కృతి చిహ్నములు

1920 లో మొహంజదారో వద్ద నేల త్రవ్వి పరిశోధన సాగించి నపుడు ఆసియాఖండ పశ్చిమభాగమందు వెలసిన నగర రాజ్యసంస్కృతి వంటిది మన భారతదేశమందు సైతము వెలసియుండెనని తెలియవచ్చినది. ఈ పరిశోధన 1931 లో ఆగిపోవుట చేత ఆ నాగరకత యొక్క వివ రణములు సమగ్రముగా తెలిసికొనుట కవకాశము లేకపోయినది. ఆ నగర సంస్కృతి వెలసిన కాలమును సరిగా నిర్ణయించి చెప్పుటకు ఇక్కడి పరి

శోధనల వలన సాధ్యము కాకపోయినను, ఆ కాలమందలి భారతీయ వర్తకులును, ఇతరులును మెసపొటేమియాలో విడిచిపెట్టిన గురుతులవల్లను, మొహరుల వల్లను ఆ కాలమును నిర్ణయించుటకు సాధ్యమైనది. హరప్పా నగరము సుమారు క్రీ.పూ. 2300 నుండి క్రీ పూ. 1700 వరకు మహోన్నత స్థితిలో ఉన్నట్లు తెలియవచ్చినది. అంతేకాక, సింధు నాగరకత సింధు మైదానంలోనే పుట్టి పెరిగినదని దాని ప్రత్యేకతను బట్టి చెప్పవచ్చును.

మొట్టమొదట సింధుమైదాన మందలి జనులు పల్లెలలో మట్టిగోడలతో ఇళ్ళు కట్టుకొని నివసించుచుండిరి; కొన్ని రాతి పనిముట్లు, పరికరములు సైతము వారు వాడుకొనుచుండిరి మట్టితో కుండలు చేసి, అవి అందముగా కనబడునట్లు రమ్యమైన రంగుచిత్రములతో వాటిని అలంకరించుచుండిరి. ఇటీవల వీలర్ గావించిన పరిశోధనల వలన హరప్పా నగరము కోట నిర్మితము కాక పూర్వము చిన్నపల్లె గానే ఉండవచ్చుననియు, అప్పుడు ఆ పల్లెలో నుండిన జనులు కోట కట్టినప్పటినుండియు నివసించిన జనులకు భిన్నమైన వారయి ఉండవచ్చునియు తెలియజేయు నిదర్శనములు కనిపించినవి.

## హరప్పా నగర శిథిలములు

హరప్పా నగరము మొహంజదారో నగరము కంటె ప్రాచీనతరమైనది. ఈ నగరము నందలి ముఖ్య మందిరములు రావీనది తీరమున 400 గజముల పొడవు వెడల్పులు గల ఒక చతురస్రాకారపు కోట ఆవరణలో ఉండేవి. ఈ కోటగోడలు పునాదుల వద్ద 40 అడుగులు వెడల్పు గలిగి అంతకంతకు పైకి లేచిన కొలది కొంచెము కొంచెము వెడల్పు తగ్గి 35 అడుగులు ఎత్తుగా నున్నవి. ఈ గోడల మధ్యభాగము పచ్చి ఇటుకలతోను, వెలుపలి భాగములు కాల్చిన ఇటుకలతోను కట్టబడినవి. కోటకు త్త

రమున కార్మికుల వసతులు, నదీతీరము వైపు ధాన్యాగారములు ఉండెను. హరప్పాలో ఆనాడు చనిపోయినవారి దేహములను పెద్ద పెద్ద కుండలలో పెట్టి గోతులలో ఉంచి పూడ్చివేయుచుండిరి. చనిపోయిన వారు స్త్రీలయిన యెడల- వారి దేహములతో పాటు రాగితో చేసిన అద్దములను సైతము చేర్చి పెట్టుచుండిరి మెసపొటేమియాలో వలె ఇక్కడ కూడ ధనికులై యుండినవారు చనిపోయిన యెడల- వారి దేహములను కఱ్ఱపెట్టెల (Coffin) లో పెట్టి పూడ్చి వేయుచుండిరి. కొంతకాలము గడచిన తర్వాత- అనగా హరప్పా నగరపు కడపటి దశయందు- అక్కడ మరి యొక తెగవారు జీవించియుండవలెను ఎందుచేత ననగా వారి కుండల తీరు, ఆ కుండలపై చిత్రితములైన రంగు చిత్రముల తీరు మరియొక విధముగా నుండెను. వీరాచరించిన అపరకర్మల విధానము సైతము భిన్నముగా నుండెను. చనిపోయిన వారి దేహములను గాక, వారి అస్థిక లను కుండలలో పెట్టి వీరు పూడ్చుచుండిరి. వీరి స్మశానము హరప్పా నగర పరిసరములలో ఒకచోట కనబడినది. వీరి కుండలపై గల కొన్ని చిత్రములను బట్టి హరప్పా నగరమును నాశనము జేసినవారు వీరే అయి యుందురని ఊహించి, వీరికి శ్మశానపు వారని పేరు పెట్టిరి. వేద కర్తలయిన ఆర్యులు వీరే అయి యుండవచ్చునని కొందరు చరిత్ర రచయితలు తలచిరి

## సింధు నాగరకత

హరప్పా నగరము కంటె మొహంజదారో నగరము తక్కువ శిథిలమై యుండుటచేత అక్కడ దొరికిన వాటినిబట్టియే సింధునాగరకత యొక్క ఉన్నతస్థితిని ఎక్కువగా తెలిసికొనుటకు సాధ్యమయినది. మొహంజదారో నగరము సింధునదికి కుడివైపుతీరమున వాయవ్యపు రైలు మార్గమునకు శాఖగా నున్నకోటి, దాదు, లార్కానా రైలుమార్గములో

గల డోక్రి స్టేషనుకు సుమారు 9మైళ్ళ దూరమున వెలసియుండెను. ఈ నగరము ఒక చదరపుమైలు విస్తీర్ణము గలది ఒక పథకము ననుసరించి కట్టబడిన ప్రాచీననగరములలో ఇదే మొదటినగరమని చెప్పవచ్చును. ఇక్కడ కూడ సుమారు 400 గజముల పొడవు, 200 గజముల వెడల్పు గల కోట ఉండెను. ఇందు విశాలమైన వీథులు, పెద్ద ఇటుకలతో కట్టిన భవనములు గలవు. ప్రతి గృహమునుండియు మురుగు కాల్వలు వీథి నడుమ భూతలమునకు అడుగున కట్టి ఉన్న పెద్దమురుగు కాల్వను చేరు నట్లు అమర్చబడి యుండెను. ఈ నిర్మాణ విధానమునుబట్టి ఆనాటికే మన భారత దేశమందు శాస్త్రీయమైన ఆరోగ్య రక్షక విధానము ఎంత ఎక్కు వగా అభివృద్ధి చెందియుండెనో స్పష్టముగా బోధపడుచున్నది.

ఈ నగరములో పెక్కుమంది వర్తకులు, కార్మికులు, తదితర జనులు నివసించుచుండిరి. వీరు ఆసియాఖండ మందలి పడమటి భాగము నందుండిన జనులతోను, ఇతర దేశస్థులతోను వాణిజ్యవ్యాపారములు సాగించుచుండిరి. అనేక విధములయిన ఆభరణములు రాతితోను, బంగా రము తోను, తయారుచేసికొని ధరించుచుండిరి.

ఆనాడు ఈ నగరమున గల వారికి ఒక ప్రత్యేక లిపి కూడ ఉన్నట్లు కనబడు చున్నది; కాని, దానిని మనమిప్పుడు చదువలేము. అచ్చట వేలకొలదిగా మొహరులు దొరికినవి. వాటిపైని లిపి కనబడు చున్నది. ఆ మొహరులు ఆనాటి నాణెములుగా వాణిజ్య వ్యాపారములతో చలామణి అగుచుండెనని ఊహింప వచ్చును.

సింధుమైదానమందు హరప్పా మొహంజదారో మొదలయిన నగ రములందుండిన జనుల మత సంస్కారములు చూడగా వారు ఆర్యులకు పూర్వులని తోచును. మొహరులపై గల కొన్ని చిత్రములనుబట్టి వారు

శైవమతావలంబులయిన ద్రావిడులయి ఉండవచ్చునని కొందరు చారిత్రకు లూహించుచున్నారు.

## ఝుక్కర్ సంస్కృతి

దక్షిణసింధులో హరప్పా నాగరకత నశింపగానే చన్హుదారో అను నగరమందు మరియొక తెగ జనులు ప్రబలులైరి. వారును రాగి పని ముట్లు పరికరములు, కుండలు చేసికొనిరి, మోహరులు వాడుకొనిరి. కాని వాటి తీరు, ఆకారము కొంచెము భిన్నముగా ఉన్నవి వారి సంస్కృతికి ఝుక్కర్ సంస్కృతి యని పేరు.

## గంగా మైదానము

సింధునాగరకత గంగామైదానమునకు వ్యాపించినదా? లేదా? ఈ ప్రశ్నకు తగిన సమాధానము లభింపలేదు కాని, ఆ నాగరకత ముందుకు సాగకుండ గంగా మైదానపు గడపకడనే ఆగి నశించినదనుట సమంజసము కాదు. గంగా మైదానపు లోహయుగమునాటి జనుల నాగరకతను గురించి మనకు అంతగా తెలియదు. కాని, అక్కడ ప్రాచీనయుగము నాటి రాగి పరికరములు చాల కాలము క్రిందటనే దొరికినవి తగిన పరిశోధన జరుగక పోవుటచే వాటి కాలమును ఇదమిత్థమని నిర్ణయించి చెప్పలేము

గంగా మైదానములో ఈ దిగువ పేర్కొన్న స్థలములందు రాగి పరికరములు దొరికినవి.

1. రాజ్‌పురము 2 మధుర 3. ఇటావా 4 బిహార్ 5 కౌశాంబి 6 హజీరాబాఘ్ 7. బిసౌలి 8. ఫతేఘర్ 9. మైన్‌పూరి 10 పరియార్ 11. పాలమౌ 12. రాంచి 13. తమజూరి 14 గుంగేరియా

ఈ స్థలాలలో దొరికిన రాగి పరికరములు అనేక విధములయినవి. రాగి గొడ్డళ్ళు, ఉలులు, గండ్ర గొడ్డళ్ళు మొదలైనవికొన్ని సింధు మైదా

నములో సైతము దొరికినవి కాని, వీటి అన్నిటి కంటెను ముఖ్యమైనవి సింధు మైదానములో దొరికినవి మరి కొన్ని ఉన్నవి. అందులో చెప్పదగినది రువ్వెడు ఈటె (Barbed Harpoon); దానికి పెక్కు ముళ్ళు కలవు.

## దక్షిణ భారత దేశము

దక్షిణ హిందూ దేశములో నూతన శిలాయుగ చరమ దశలో గాని, దాని తర్వాతగాని, రాగి పరికరములు వెలసినట్లు కనబడదని కొందరు తలచినారు. కాని, ఈ నడుమ మైసూరు రాజ్యమందలి ఉత్తరభాగమందు జరిగిన పరిశోధనల వలన రాగి గొడ్డలి, రాగిఉలి, రాగిఉంగరము, కంచు సూది దొరికినది. హైదరాబాద్, కల్లూరు ప్రాంతములలో రెండు రాగిఖడ్గములు దొరికినవి. అందుచేత ఈ ప్రాంతములో నూతన శిలాయుగ మందలి రాతిపరికరములతో రాగిపరికరములు కూడా సుమారు క్రీ పూ. 1,000 నాటికే వాడుకలో ఉండెనని చెప్పవచ్చును. ఇంకను దక్షిణ భారతములో పరిశోధనలు జరుగవలసియున్నది.

## రాక్షస గుళ్లు

దీని తర్వాత కాలములో దక్షిణ దేశమంతటను, మృత్యుస్మారక చిహ్నములయిన కట్టడములు (Funerary Monuments) కనబడుచున్నవి. ఇవి దక్కనుమధ్యపీఠభూమిలో నూతన శిలాయుగాంతమున రాగిపరికరములు కూడా దొరుకుచుండిన సంధి యుగమునకు తరువాతవనియు సుమారు క్రీ. పూ. 500 నాటివనియు మైసూరు ఉత్తరభాగమందున్న బ్రహ్మగిరిలోను, బళ్లారిలోను జరిగిన పరిశోధనల వలన తెలిసికొనుటకు అవకాశము కలిగినది. పెద్ద రాతికట్టడము (Megaliths)లకు తెలుగుదేశములో రాక్షసగుళ్ళనియు మోరియవారి గుళ్లనియు పేళ్లు వీటిని మరుగుజ్జు లెవరో కట్టి రన్న నమ్మకము తెలుగువారిలో కలదు.

ఈ కట్టడములలో అనేక విధములయినవి కలవు మలబారు దేశమందు నేల దొలిచి కట్టిన ఇళ్ళు కలవు. ఆ ఇళ్ళలోనికి పోవుటకు క్రిందికి మెట్లు ఉన్నవి. అవి సమాధులు. అందు ప్రతి సమాధిలోను మంచము, బెంచి, చలిగుండము రాతిలోనే తొలిచి కట్టిఉన్నవి అంతేకాక, కొన్ని ఇనుప పరికరములు, కుండలు, దీపపు వత్తులు కూడ చనిపోయిన వారి బంధువులు పెట్టినవి కనబడు చున్నవి. అవి పితృదేవతలకు ఆనాటి వారు కట్టిన ఇళ్ళు.

తిరునల్వేలి జిల్లాలో పెద్దగోతులు నూతులవలె రాతిలో త్రవ్వి, వాటి అడుగున వున్న ఒక్కొక్క గోతిలోను ఒక్కొక్క పెద్ద కుండను, అస్థికలు, కాయధాన్యము, అభ్రకము మొదలయిన సామగ్రితో నింపి పెట్టు చుండిరి.

## మట్టి శవపేటికలు

చెంగల్పట్టు జిల్లాలో మట్టితో చేసిన పీనుగుపెట్టెలనేకము కనబడినవి. ఒక్కొక్కపెట్టె సుమారు ఆరడుగులు పొడుగు, అడుగున్నర వెడల్పు గలది అందులో ఎముకలు, కుండలు పెట్టి, ఆ పెట్టెను భూమిలో పూడ్చుచుండిరి. ఆ పెట్టెకు ఆరుగాని, ఎనిమిది గాని కోళ్ళుండెను. ఆ పెట్టె పూడ్చిన స్థలము చుట్టును వలయాకారముగ రాళ్ళు పేర్చి పూడ్చుచుండిరి. అదిగాక, పెద్ద పెద్ద కుండలలో సైతము అస్థికలు పెట్టి, పైని చెప్పినట్లే వాటిని భూమిలో పూడ్చి, వాటి చుట్టును కూడ రాళ్ళు పేర్చి పూడ్చుచుండిరి.

కడప జిల్లాలో గొఱ్ఱె ఆకారముగల పీనుగు పెట్టె మట్టితో చేసినదే-శంకవరమునందు కనబడినది. అక్కడ అస్థికలుగల కుండలు కూడా కనిపించినవి.

## రాతి శవ పేటికలు

రాయలసీమలోని ఒక జిల్లాలోను గుంటూరు, ఉత్తర ఆర్కాడు, సేలం, కోయంబత్తూరు, మధుర, నీలగిరి జిల్లాలలోను కొచ్చిన్, తిరువాన్ కూరు, పుదుకోట, మైసూరు, హైదరాబాదు సంస్థానాలలోను, బొంబాయి రాష్ట్రమందలి బిజాపూర్, ధార్వాడ్ జిల్లాలలోను, కరాచీ పరిసరము లందును రాతితో కట్టిన పీనుగు పెట్టెలు (Stone Cists) కనబడినవి.

## డాల్మెన్‌లు

హైదరాబాదులోను, రాయలసీమలోను పైని వర్ణించిన దానికి కొంచెము భిన్నముగా ఉండు కట్టడములు కనిపించినవి. భూమిలోగాక, భూమి పైభాగమందే నాలుగు రాతిపలుకలు భూమిలో పాతి చతురస్రాకారముగల గది ఏర్పడునట్లు నిలబెట్టిరి ఆ రాతి పలకలపై మరియొక పెద్దరాతిపలకను పెట్టి ఆ గదిని మూసివేసిరి ఇక్కడ సైతము తూర్పున ఉన్న రాతి పలకకు రంధ్రము గలదు. ఈ కట్టడమునకు డాల్మెన్ అని పేరు.

పైని చెప్పిన కట్టడముల కాలముతో దక్షిణదేశమున చరిత్ర పూర్వ యుగము ముగిసినదని చెప్పవచ్చును. మైసూరు బళ్లారి ప్రాంతములలో సుమారు క్రీ. పూ. 200 నాటికి ఈ యుగమంతమై యుండవచ్చును. అటుపైని చరిత్రకారునికి శాసనములు, నాణెములు, ఇతర లిఖిత ఆధారములు తోడ్పడు చున్నవి. వేదములను మినహాయించినచో, క్రీ. పూ. 500 అనంతరమే చరిత్ర రచనకు లిఖితాధారములు కనవచ్చుచున్నవి.



# కౌటిల్యుని అర్థశాస్త్రము

## ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య

కౌటిల్యుని అర్థశాస్త్రము దండనీతి లేదా రాజనీతిని గురించి మన దేశములో వ్రాయబడిన గ్రంథములన్నిటిలో అగ్రస్థానము వహించినట్టిది. దాని ప్రాశస్త్యమున కనేక కారణము లున్నవి. వానిలో ప్రధానములగు వానిని కొన్నిటిని గుర్తించుట అవసరము.

**1**

అర్థశాస్త్రము బహుప్రాచీనమగు శాస్త్రము. కౌటిల్యునికి పూర్వము అర్థశాస్త్ర గ్రంథము లనేకములు వ్రాయబడినట్లు కౌటిల్యుని గ్రంథము మూలమునను మహాభారతాది ఇతర గ్రంథముల మూలమునను తెలియ వచ్చుచున్నది. కాని అవి యన్నియు శిథిలములై నామమాత్రావశిష్టము లైనవి. వానిలోని సూత్రములు కొన్నియు శ్లోకములు కొన్నియు తప్ప తక్కిన భాగములు మనకు లభ్యము కాలేదు. వాని ప్రతులేవియు మనకు దొరకలేదు. కౌటిల్యుని గ్రంథ మిట్లు శిథిలము కాక నిలబడగలిగినది.

అందుచేత ప్రస్తుతము ప్రచారమందుండు ప్రాచీనకాలపు రాజనీతిగ్రంథము లలో కౌటిల్యుని అర్థశాస్త్రమే మొదటిది అని చెప్పవచ్చును. దాని ప్రాశస్త్యమున కిది యొక కారణము.

కౌటిల్యుని తర్వాత మధ్యయుగములో కొందరు రాజనీతిని గురించిన గ్రంథములను వ్రాసిరి. నీతిసారమును వ్రాసిన కామందకుడు, నీతివాక్యామృతమును వ్రాసిన సోమదేవుడు, నీతిప్రకాశికను వ్రాసిన వైశంపాయనుడు శుక్రనీతిని వ్రాసిన గ్రంథకర్త ఇట్టివారిలో కొందరు. ఇదికాక మహాభారతములోని శాంతిపర్వమందు రాజనీతిని గురించిన వివరణ మున్నది. కాని ఈ గ్రంథము లేవియు కౌటిల్యుని గ్రంథమువలె సమగ్రములైనవి కావు. పరిపాలనమునకు సంబంధించి అతడు వివరించిన విషయము లనేకములు వీని యందు కనిపించవు. కామందకుని గ్రంథమునకు కౌటిల్యుని అర్థశాస్త్రము మూలగ్రంథమయినను అర్థశాస్త్రములోని ప్రధానాధికరణము లగు అధ్యక్ష ప్రచారము, ధర్మస్థీయము, యోగవృత్తము, సంఘవృత్తము మొదలగువానిని గురించి నీతిసారములో ఎట్టి ప్రసక్తియు లేదు. వీనిలో కొన్నిటిని గురించి శుక్రనీతి ప్రస్తావించినను అది మిక్కిలి సంక్షిప్తముగ నున్నది. కావున రాజనీతిని గురించిన మన గ్రంథము లన్నిటిలో కౌటిల్యుని అర్థశాస్త్ర మొక్కటే సమగ్రమైనట్టిది అని చెప్పవచ్చును దాని ప్రాశస్త్యమున కిది యొక కారణము.

గ్రంథకర్తను బట్టికూడ గ్రంథమునకు ప్రాశస్త్యము లభించుట సహజము. కౌటిల్యుడు కామందకాదుల వలె పండితుడు మాత్రమే కాడు. అతడు లౌకిక వ్యవహారములందు గొప్ప అనుభవమును సంపాదించిన వాడు మౌర్య సామ్రాజ్యమును స్థాపించిన చంద్రగుప్త చక్రవర్తికి కుడిభుజమై సామ్రాజ్య స్థాపనములో నతనికి సహాయము చేసినవాడు. శాస్త్రములోని సిద్ధాంతములను నిర్వచించుట యందేగాక వానిని ప్రయో

గించుట యందుగూడ నైపుణ్యమును సంపాదించినవాడు. పరిపాలనమందనుభవము గలవారే శాస్త్రము నుపదేశించుటకు అర్హులని అతని మతము. దీనిని మనసు నందుంచుకొనియే అతడు రాజపుత్రుని విద్యాభ్యాసమును వివరించుసందర్భములో రాజపుత్రుడు, 'సిద్ధాంతము ప్రయోగము తెలిసిన వారి వద్ద నుండి దండనీతిని నేర్చుకొనవలెను,' అని చెప్పెను. (1-5-8) ఇందుచేత నితని గ్రంథములోని సూత్రములు వ్యవహారానుకూలములుగను ఆచరణార్హములుగను ఉన్నవి. ఇది యొక గొప్ప విశేషము. దీనినిబట్టి గూడ కౌటిల్యుది గ్రంథమునకు ప్రాశస్త్యము లభించినది

## 2

కౌటిల్యుడు తన గ్రంథమును అర్థశాస్త్రమని పేర్కొనెను. దండనీతికి అర్థశాస్త్రమను నామాంతర మున్నట్లు మహాభారతము నుండి తెలియుచున్నది. శాంతిపర్వమం దొకచోట అర్జునుడు అర్థశాస్త్రవిదుడని చెప్పబడి యున్నది. మరియొకచోట శ్రేష్ఠులగు రాజులు అర్థశాస్త్రము ననుసరించెదరని చెప్పబడియున్నది. కాని ఈ పేరు ఎక్కువగ ప్రచారములో నుండి నట్టిది కాదు. కామందకాదులు నీతిశాస్త్రమను పదమునే వాడిరి. మహాభారతమందును తదితర గ్రంథములందును దండనీతి, రాజనీతి, రాజశాస్త్రము, రాజధర్మము అను పేర్లు వాడబడియున్నవి. కౌటిల్యుడు కూడ విద్యల సంఖ్యను నిర్ణయించు సందర్భములో విద్యలు అన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి అను పేర్లుగల నాలుగని చెప్పెనేగాని అర్థశాస్త్రమను మాటను వాడియుండలేదు. దానికి బదులు దండనీతి అనియే ఉపయోగించెను. దీని నుండి దండనీతి అను పేరు ఎక్కువ ప్రచారములో నుండెనని స్పష్టమగుచున్నది.

దండనీతికి అర్థశాస్త్రమను పేరుకూడ ఎట్లు తగియున్నదో కౌటిల్యుడు తన గ్రంథమందొకచోట చెప్పియున్నాడు. మనుష్యుల "జీవితము

నకు మూలము అర్థము; లేదా మనుష్యులతో కూడిన భూమియే అర్థము. అట్టి భూమిని సంపాదించు ఉపాయములు, పాలించు ఉపాయములు— వీనిని గురించిన శాస్త్రము అర్థశాస్త్రము." అని (15-1-1,2). అర్థము నకు భూమి మూలమగుటచేత భూసంపాదన పరిపాలనములను గురించిన శాస్త్రమునకు అర్థశాస్త్రమను పేరు తగినట్టిది అని అతని భావము.

దండనీతియొక్క ఉద్దేశము గూడ నిదివరకు లభించని (భూమిని) దానిని లభింపజేయుట, లభించిన దానిని పరిరక్షించుట, రక్షింపబడిన దానిని వృద్ధిగాంచి దానిని సత్పాత్రుల కందచేయుట అని అతడు వివ రించెను. ఈ రెంటియొక్క ఉద్దేశము ప్రధానముగ భూమిసంపాదన, పరి పాలనములు. అందుచేత దండనీతికి అర్థశాస్త్రమను పర్యాయపదమును వాడుటలో అనౌచిత్యము మెట్టిదినియు లేదని కౌటిల్యుని అభిప్రాయము. ఇంతేకాక ఆతనిపూర్వులు కొందరు అర్థశాస్త్రమను పేరును వాడియుండిరి.

ప్రస్తుత కాలమున ప్రచారములో నుండు అర్థశాస్త్రములోని విష యములకును కౌటిల్యుని విషయములకును ఎట్టిసంబంధము లేదని గుర్తిం చుట అవసరము ప్రస్తుతకాలమందు మానవులవాంఛలను తీర్చుటకు సాధ నములగు ఆహారాదిపదార్థముల సముదాయమే అర్థమనియు అట్టి అర్థము యొక్క ఉత్పత్తి, పంపకము, వినిమయము, వినియోగము, మున్నగు వానిని వివరించుశాస్త్రము అర్థశాస్త్రమనియు శాస్త్రవేత్తల అభిప్రాయము. దీని కనుగుణముగ ఈనాటి అర్థశాస్త్రగ్రంథములు వ్రాయబడుచున్నవి. ఇట్టి శాస్త్ర మొకటి ఉండవలెనని కౌటిల్యునికి తెలిసినదే. కౌటిల్యునికేకాదు, ప్రాచీనులందరు దీని అవసరమును గ్రహించిరి. అందుచేతనే నాలుగు విద్యలలో వార్త అనునది యొకటిగ గుర్తించబడెను. దీనిని గురించి కౌడిల్యుడీ విధముగ చెప్పియున్నాడు : "వ్యవసాయము, పశుపాలనము, వాణిజ్యము, కలిసి వార్తఅని అనిపించుకొనును. వీటిసాధనమున ధాన్యము,

పశువులు, హిరణ్యము, వన్యపదార్థములు, విష్టి (కూలిజనము) లభించ గలవు," అని (1-4-1,2). దీని నుండి ప్రాచీనకాలపు వార్తాశాస్త్రమే ఈ కాలపు అర్థశాస్త్రమని చెప్పుటసహేతుకముగ కనిపించుచున్నది.

ఈ సందర్భములో మరియొక విషయమునుగురించి ప్రస్తావించుట ఉచితమని తోచుచున్నది. జీవితములో మానవుడు సాధించవలసిన ప్రయోజనములు (పురుషార్థములు) నాలుగనియు, అవి ధర్మార్థకామమోక్షము లనియు మనపూర్వులు భావించిరి. శాస్త్రగ్రంథములను రచించినవారు దీని కనుగుణముగ నాలుగువిధములగు శాస్త్రములు రచించిరి. శాస్త్రములలో ఒక్కొక్కటియు ఒక పురుషార్థమునకు సంబంధించినట్టిది. అందుచేత నవి ధర్మశాస్త్రములు, అర్థశాస్త్రములు, కామశాస్త్రములు, మోక్షశాస్త్రములు అని పేర్కొనబడినవి. కౌటిల్యుడు పేర్కొనిన నాలుగువిద్యలను ఈ వర్గీ కరణముతో కొంతవరకు సమన్వయింపవచ్చును. ఆన్వీక్షకి మోక్షశాస్త్రము తోను, త్రయి ధర్మశాస్త్రముతోను, వార్తాదండనీతులు కలిసి అర్థశాస్త్రము తోను పోల్చదగియున్నవి. ఇందులో కామశాస్త్రములు పేర్కొనబడలేదు. దానికి కారణ మున్నది. విద్యలసంఖ్యను నిర్ణయించుటలో కౌటిల్యుని ప్రధానోద్దేశము రాజపుత్రుని విద్యాభ్యాసకాలమందతడు ఏయేవిద్యలను నేర్చుకొనవలెనో పేర్కొనుట. రాజపుత్రునికి కామశాస్త్రమును తెలిసికొన వలసిన అవసరము లేదని అతడు భావించెను. అందుచేత దానిని విద్యలలో చేర్చలేదు.

శాస్త్రములు నాలుగు విధములయినను వానిలో అర్థశాస్త్రము స్వతంత్రశాస్త్రము కాదనియు అది ధర్మశాస్త్రము నుండి పుట్టినదనియు కొందరివాదము. కౌటిల్యుని గ్రంథములోని న్యాయ విచారణమునకు కంటక శోధనమునకు సంబంధించిన మూడవ నాల్గవ అధికరణములలోని విషయ ములకును ధర్మశాస్త్రములలోని వ్యవహారకాండకు సంబంధించిన విషయ

ములకును సామరస్యము ఎక్కువగనుండుటయు, ధర్మశాస్త్రములలోని వివరణమును కౌటిల్యుడు గ్రహించినందుననే ఇట్టిసాదృశ్య మేర్పడినదను టయు ఈ వాదమున కాధారములు. కాని ఇది బలములేని వాదము. ఏలయన ధర్మశాస్త్రముల దృక్పథము అర్థశాస్త్రముల దృక్పథమునకు పూర్తిగ భిన్నమైనట్టిది. ధర్మశాస్త్రములోని ప్రధానవిషయము వర్ణాశ్రమధర్మముల వివరణము. ఈ శాస్త్రములకు మాతృకలగు ఆపస్తంబుని ధర్మసూత్రములు. బోధాయనుని ధర్మసూత్రములు దీనిని స్పష్టపరుచుచున్నవి. ఇది గాక ధర్మశాస్త్రములు ప్రధానముగ వ్యక్తులనుద్దేశించియు వారివారిదైనందిన జీవితములో ననుసరించవలసిన విధులగురించియు వివరించు గ్రంథములు అర్థశాస్త్రములోని ప్రధానవిషయము పరిపాలనావిధానము. అది రాజును ఉద్దేశించి వ్రాయబడినట్టిది. అర్థశాస్త్రములో ధర్మస్థీయాద్యధికరణముల లోని ధర్మమునకును ధర్మశాస్త్రములలోని ధర్మమునకును సంబంధము లేదు. అర్థశాస్త్రములోని ధర్మమనుమాట న్యాయమను అర్థమందు వాడ బడినది. న్యాయమనగా న్యాయస్థానములలోని ధర్మస్థులు (న్యాయాధీశులు) వ్యవహార పరిష్కారములందు గుర్తించిన విధినిషేధములు. ధర్మశాస్త్ర ములలో ధర్మ మనుమాట వర్ణాశ్రమధర్మములు అను అర్థమందు వాడబడి నది. అర్థశాస్త్రములోని ధర్మమునుల్లఘించిన వారు న్యాయస్థులు విధించిన శిక్షను అనుభవించవలసిన వారుగ నుండిరి. ధర్మశాస్త్రములోని ధర్మము నుల్లంఘించిన వారికి ప్రాయశ్చిత్తమే పరిహారము, విషయములందును, దృక్పథములందును ఇంతటి భేదమున్నప్పుడు ధర్మశాస్త్రము నుండి అర్థ శాస్త్రము పుట్టినట్లు చెప్పుట సహేతుకము కాజాలదు. కొన్ని విషయముల నీరెంటికిని సాదృశ్య ముండుటకు కారణము ధర్మశాస్త్రకర్తలు ఆ విషయ ములను అర్థశాస్త్రగ్రంథముల నుండి గ్రహించుటయే ఆవిషయములు న్యాయస్థానములలో న్యాయవిచారణకు సంబంధించినట్టివి. ధర్మసూత్రము

లను రచించిన ఆపస్తంబాదులదృష్టిలో నవి అంత ప్రధానములుగ నుండ లేదు. వానిని గురించి వారు ఎక్కువగ కృషిచేసి యుండలేదు; అందుచేతనే వారు వానికి సంబంధించిన వివరణమునంతను అర్థశాస్త్ర గ్రంథములనుండి గ్రహించుట జరిగెను. మనుస్మృతికర్త, యాజ్ఞవల్క్యుడు మున్నగు వారు కూడ ఈ సంప్రదాయమునే అనుసరించిరి. కొన్ని విషయములలో రెండు శాస్త్రములలో కనిపించు సాదృశ్యమున కిదియే కారణము. దీనిని బట్టి అర్థశాస్త్రము స్వతంత్రమగు శాస్త్రమనియు, ధర్మశాస్త్రకర్తలు అందులోనుండి కొన్ని భాగములను గ్రహించిరనియు స్పష్టమగుచున్నది.

## 3

అర్థశాస్త్రమును రచించినవాడు కౌటిల్యుడేనా ? అట్లైన పక్షమున అతడెప్పటివాడు? ఎక్కడివాడు? అను విషయములను గురించి వాదోప వాదము లనేకములు జరుగుచున్నవి కౌటిల్యుడే దీనిని రచించిన వాడను సిద్ధాంతము బలవత్తరముగ నున్నట్లు చెప్పవచ్చును. ఈ సిద్ధాంతమును రెండు రకములగు హేతువులచే సమర్థించవచ్చును. గ్రంథములో కనిపించు ఆధారములు మొదటి రకములోనివి వందలాది సంవత్సరములుగ దేశ మందు వ్యాప్తిగాంచిన ప్రతీతియు, ప్రాచీనగ్రంథకర్తలు వారిగ్రంథ ములందీ విషయమును గురించి చేసిన ప్రస్తావనలును రెండవ రకము లోనివి.

కౌటిల్యుడే అర్థశాస్త్రమును వ్రాసినాడనుటకు గ్రంథములోనే కొన్ని ఆధారము లున్నవి. వానిలో మొదటిది :

సుఖగ్రహణవిజ్ఞేయం తత్త్వార్థపదనిశ్చితమ్।
కౌటిల్యేన కృతం శాస్త్రం విముక్తగ్రంథ విస్తరమ్॥

అను మొదటి అధ్యాయములోని చివరి శ్లోకము (1-1-17)

వానిలో రెండవది:

సర్వశాస్త్రాణ్యను క్రమ్య ప్రయోగ ముపలభ్య చ
కౌటిల్యేన నరేంద్రార్థే శాసనస్యవిధిః కృతః

అను రెండో అధికరణములోని పదో అధ్యాయమందలి శ్లోకము(2-10-63)

వానిలోని మూడవది :

యేన శాస్త్రం చ శస్త్రం చ నందరాజగతా చ భూః
అమర్షే ణోద్ధృతా న్యాశు తేన శాస్త్ర మిదం కృతమ్॥

అను గ్రంథాంతమందుండు శ్లోకము (15-1-73)

వానిలో నాల్గవది :

దృష్ట్వా విప్రతిప త్తిం బహుధా శాస్త్రేషు భాష్యకారాణామ్
స్వయ మేవ విష్ణుగు ప్త శ్చకార సూత్రం చ భాష్యం చ

అను గ్రంథాంతమందలి వాక్యము

వానిలో అయిదవది : "కౌటిలీయ స్యార్థశాస్త్రస్య" అని ప్రతి అధికరణాంతమందలి గద్యలోనుండు మాటలు.

వానిలో ఆరవది : అర్థశాస్త్రగ్రంథములను రచించిన ఇతరుల అభిప్రాయములను విమర్శించు సందర్భములో, "ఇతి కౌటిల్యః", "నేతి కౌటిల్యః", అని గ్రంథక ర్త తన అభిప్రాయమును వ్య క్తపరుచుట.

ఈఆరు ఆధారములనుబట్టి అర్థశాస్త్రమును రచించినవాడు కౌటిల్యుడని స్పష్టమగుచున్నది. ఈ సందర్భమున విష్ణుగుప్తుడు చాణక్యుడు అనునవి కౌటిల్యుని నామాంతరములని గ్రహించవలసి యున్నది. కౌటిల్యుడను పేరు గోత్రమునుండియు, చాణక్యుడనుపేరు తండ్రి నుండియు లభించినవి. విష్ణుగు ప్తుడనునది వ్యవహారనామము.

గ్రంథములోని ఆధారములేకాక ప్రాచీనకాలపు గ్రంథకర్తలనేకులు అర్థశాస్త్రమును వ్రాసినవాడు కౌటిల్యుడని చెప్పిరి. నీతిసారకర్త యగు కామందకుడు :

"నీతిశాస్త్రామృతం శ్రీమా నర్థశాస్త్రమహోదధేః
య ఉద్ధథ్రేనమ స్తస్మై విష్ణుగుప్తాయ వేధసే

అనుశ్లోకమున అర్థశాస్త్రమను మహాసముద్రమునుండి నీతి శాస్త్రమను అమృతమును విష్ణుగుప్తుడు మథించెనని చెప్పెను. దండి మహాకవి తన దశకుమారచరిత్రమున: "అధీష్వ యావద్దండనీతిం, ఇయ మిదానీమాచార్య విష్ణుగుప్తేనమౌర్యార్థే షడ్భిఃశ్లోకసహస్రై సంక్షిప్తా" అని చెప్పెను. ఇదిగాక కౌటిల్యుని అర్థశాస్త్రములోని సూత్రము లనేకములను తన గ్రంథమందుదాహరించెను. పంచతంత్రకర్త తన గ్రంథమందు: "తతోధర్మాశాస్త్రాణి మన్వాదీ, న్యర్థశాస్త్రాణి చాణక్యాదీని. కామాశాస్త్రాణి వాత్స్యాయనాదీని", అని చెప్పియున్నాడు. ముద్రారాక్షస నాటకమును వ్రాసిన విశాఖదత్తుడు చాణక్యునికి కౌటిల్యుడను నామాంతర మున్నట్లు చెప్పుటయే గాక కౌటిల్యుని అర్థశాస్త్రములోని నీతిననుసరించి కథనునడిపి అందుండి సూత్రములనేకములను తన నాటకమందు పొందుపరిచెను. జైనులపవిత్ర గ్రంథములలో నొకటియగు నందిసూత్రము కౌటిల్యుని అర్థశాస్త్రమును పేర్కొని అది మిధ్యాశాస్త్రములలో నొకటిగ పరిగణించుచున్నది బాణకవి తన కాదంబరియందు: "కింవా తేషాం సాంప్రతం యేషాం అతినృశంస ప్రాయోపదేశం నిర్ఘృణం కౌటిల్య శాస్త్రం ప్రమాణం" అని వ్రాసియున్నాడు. ప్రాచీన గ్రంథములన్నిటియందు చెప్పబడిన మాటలను త్రోసివేయుటకు కారణములేవియు కనిపించవు. ఈ ప్రస్తావనలబట్టి అర్థశాస్త్రమును వ్రాసినవాడు కౌటిల్యుడే అని స్పష్టమగుచున్నది. అరవ

శతాబ్దమందుండి దేశమందంతట వ్యాప్తిగాంచిన ప్రతీతికూడ దీనినే బల పరుచుచున్నది.

ఈ ఆధారములలో ననేకములు కౌటిల్యుడు నందరాజుల వంశమును నిర్మూలించి మౌర్యవంశమునకు చెందిన చంద్రగుప్తుని సింహాసనాధిష్ఠితుని గ చేసినట్లు చెప్పుచున్నవి. చంద్రగుప్త చక్రవర్తి క్రీ. పూ. 321 ప్రాంతమున తన సామ్రాజ్యమును స్థాపించినట్లు దేశచరిత్ర నుండి మనకు తెలియవచ్చుచున్నది. అందుచేత కౌటిల్యుడు క్రీ. పూ. నాల్గవశతాబ్దపు ఆఖరు భాగమందుండిన వాడనియు అర్థశాస్త్ర సుమారు 2290 సంవత్సరముల క్రిందట వ్రాయబడెననియు చెప్పవచ్చును.



# ఆంధ్రప్రదేశ్ స్వరూపము-ప్రజలు

వై. వి. రమణ

ఆసేతు హిమాచల పర్వత వ్యాప్తమైన భరత ఖండంలో ప్రాచీన కాలం నుండి అవిచ్ఛిన్నంగా విరాజిల్లుతున్న విశిష్టసంస్కృతికి నిలయమైన ఒక భౌగోళికవిభాగం ఆంధ్రదేశం. ఏకత్వంలో వైవిధ్యం భారత సంస్కృతిలో ఉండే ఒక విశిష్టత. భారతసంస్కృతిలో బహుభాషలూ, విభిన్న లలితకళా రీతులూ అనేక సంప్రదాయాలూ భారత భూమిలోని వివిధ ప్రాంతాలలో ఉన్నాయి. వీటి అన్నింటిలోను విభిన్నమైన సంస్కృతులున్నప్పటికీ వీనికి పునాదియై వానిని సమైక్యపరచే అఖండ భారతీయ సంస్కృతి ఒకటి ఉన్నది. అటువంటి భారతీయ సంస్కృతిని, దానితో బాటు తన ప్రత్యేక సంస్కృతిని ఖండఖండాతరాలలో వ్యాపింప జేయడంలో ముఖ్యంగా ప్రాచీన కాలంలోను మధ్యయుగంలోను ప్రముఖపాత్ర వహించిన ప్రదేశాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి.

ఆంధ్రదేశ భౌగోళిక సరిహద్దులు ప్రాచీన కాలంనుండి నేటివరకూ మార్పులేక నిర్దిష్టంగా లేకపోయినా నాటి నుండి నేటివరకూ సమగ్రమైన

ఆంధ్రప్రదేశ స్వరూపాన్ని స్పష్టంగా నిర్దేశించవచ్చు. దీనికి తూర్పున బంగాళాఖాతమను సముద్రం ఉన్నది. ఉత్తరాన మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలు, పడమట మహారాష్ట్ర కర్ణాకరాష్ట్రాలు, దక్షిణాన తమిళనాడు రాష్ట్రం సరిహద్దుగా ఉన్నాయి. దీనివునికి ఉత్తర హిందూదేశానికి దక్షిణ భారత ద్వీపకల్పానికీ మధ్యస్థమై ఆర్యావర్త ద్రావిడ భూభాగాల సంస్కృతులకు మేళన సీమగానిల్చి ఉన్నది.

ఆంధ్రదేశంలో దక్షిణ భారతదేశ నదులలోనికెల్ల పెద్దనదులైన కృష్ణా గోదావరీనదులు, వాని యుపనదులు, పెన్నానది ప్రవహిస్తున్నాయి. తూర్పున విదేశవాణిజ్యానికనువైన తీరభూమి ఉంది. దానికి చేరువగా తూర్పుకనుమలనబడే పర్వత పంక్తులున్నాయి. ఈ పర్వత పంక్తులు ఎత్తుగాలేక పోవడంచేత వాని మధ్య విశాలమైన ఖాళీ ప్రదేశములుండుట చేత ఇవి దేశానికీ అడ్డుగోడలుగాలేవు. ఈ పర్వతాలకూ సముద్రతీరానికి మధ్య నదీ ప్రవాహాలవల్ల సారవంతమైన మైదానభూములున్నాయి. ఆంధ్రదేశం మధ్య భాగంలోను పడమటివైపున, దక్కను పీఠభూమికి చెందిన రాతినేల ఉన్నది. దీనిఎత్తున రమారమి 2000 అడుగులు. ఇది కొన్నిచోట్ల ఇంకను ఎత్తుగ ఉన్నది. గోదావరి, కృష్ణా ప్రవాహముల తీరునుబట్టి పీఠభూమి ఆగ్నేయంగా వాలి ఉన్నట్లు తెలుస్తుంది. తూర్పు కనుములలో ప్రధానమైన పర్వతశ్రేణులు నల్లపర్వతములు (నల్లమలలు), ఎర్రపర్వతములు (ఎర్రమలలు). వానిలో (నల్లమలలు) కృష్ణాతీరమునుండి పెన్నానది లోయవరకు వ్యాపించి ఉన్నాయి. కడప రాళ్ళు దీనిలోనివే. ఏదో శ్రీశైలం వంటి ప్రఖ్యాత క్షేత్రంలో తప్ప మిగతాచోట్ల జనసంఖ్య తక్కువ; చెంచులనబడే కొండజాతులు మాత్రం అక్కడ నివసిస్తున్నారు. కర్నూలులోని నల్లమలలకు పడమటివైపు ఎర్రమలలు ఉన్నాయి. దక్కను రాతి ప్రదేశంలోను తూర్పుకనుమల పర్వత పంక్తులలోను. అమూల్యమైన ఖనిజసంపత్తి ఉన్నది. బొగ్గు, ఇనుము, అభ్రకము,

వజ్రాలవంటి విలువైన ఖనిజాలు లభిస్తున్నాయి. అందువల్లనే ఆంధ్ర ప్రదేశ్‌లోని ప్రధాన ప్రాంతాలలో సస్యశ్యామలములైన సర్కారు జిల్లాలు, రత్ననిలయాలైన రాయలసీమజిల్లాలు, పరిశ్రమల కాలవాలము లైన తెలంగాణ జిల్లాలు ఉన్నాయి. సువిశాలమైన నేటి ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణము 1,22,574 చదరపుమైళ్ళు జనాభా సుమారు 6కోట్లు. ఆంధ్రే తర రాష్ట్రాలలోను విదేశాలలోను ఇంకా సుమారు 50 లక్షల మంది ఆంధ్రులు నివసిస్తున్నారు.

ఆంధ్ర దేశములోని నదీమతల్లుల ప్రభావం ఆంధ్రుల చరిత్ర-సంస్కృతిపై ఎంతగానో ఉంది. గోదావరి నాసిక వద్దపుట్టి మహారాష్ట్ర దేశం గుండా ప్రవహించి, ప్రాణహిత, వరదా, వైనగంగా మొదలైన ఉపనదుల తోయములతో విస్తరించి ఆంధ్రప్రదేశంలో ప్రవేశించి విశాల సైకత సీమలగుండా ప్రవహించి తూర్పుకనుమలలో పాపికొండల వద్ద పర్వతపంక్తి చీల్చుకొని ప్రవహిస్తూ రాజమహేంద్రవరం దాటిన తర్వాత అఖండ గోదావరి, గౌతమీగోదావరి, వసిష్ఠగోదావరి మున్నగుపాయలతో సప్తగోదావరిగా బంగాళాఖాతంలో లవణాబ్ధిని చేరుకుంటుంది. దీని లోయలో శాతవాహన వేంగీచాళుక్యాది వంశముల రాజ్యాలు వెలసి చరిత్రా త్మకములైనాయి. ఈనాడు దీనిపై రాజమహేంద్రవరం దగ్గర నిర్మించిన రైలు-రోడ్డువంతెన ఆసియా ఖండములో వంతెనలన్నిటి కంటే పెద్దదని చెప్పుచున్నారు. గోదావరి తర్వాత ఆంధ్రదేశంలో ప్రవహించేనదులలో పెద్దనది కృష్ణానది. పశ్చిమాన, మహాబలేశ్వరంలో ప్రభవించి మహా రాష్ట్ర కన్నడసీమలు దాటి ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశిస్తుంది. భీమానది, తుంగభద్రానది దీని ముఖ్యమైన ఉపనదులు. ఇది పడమటి కనుమలు దాటి తూర్పుకనుమలలో ప్రవేశించి విజయవాడ వద్ద సుమారు 1800 అడుగుల వెడల్పు మాత్రమేయున్న పర్వతలోయద్వారా ప్రవహించి బంగాళా ఖాత

ములోనికి చేరుతుంది. తుంగభద్రా కృష్ణానదీతీరాలు చారిత్రకంగా అనేక విఖ్యాత రాజవంశాలకు నెలవులై ఆంధ్రచరిత్రకు సంస్కృతికి ప్రఖ్యాత రంగాలుగా వెలసినాయి. కృష్ణాతుంగభద్రల మధ్యస్థమైన రాయచూరు ప్రదేశం (రాయచూరు దోఆబ్) దక్షిణాపథంలో వివిధ రాజ్యాల మధ్య వివాద గ్రస్తమైన రణరంగంగా చరిత్రలో నిలిచిపోయింది.

గోదావరి కృష్ణానదుల డెల్టాలు సారవంతమైన పంటసీమలు కావడం వల్ల ఆంధ్రప్రదేశ్ అన్నపూర్ణగా ప్రసిద్ధి పొందినది. ఇచ్చట వరిపంట ఆహార పంటలేకాక పొగాకు, పత్తి, పంచదార వంటి వ్యాపార పంటలు కూడా విస్తారంగా పండడానికి వసతులుండడంచేత, విదేశీయులైన ఆంగ్లేయులు, పరాసులు, డచ్చివారు మనదేశానికి వచ్చినపుడు ఆంధ్రదేశపు కోస్తా జిల్లాలలో ప్రథమంగా తమ కార్ఖానాలను స్థావరాలను ఏర్పర్చుకున్నారు. ప్రాచీన కాలంలో ఆంధ్రుల వాణిజ్య సంస్కృతులు ఇచ్చటనుండి ఖండాంతరాలు వ్యాపించినాయి.

నదులే కాకుండా ఆంధ్రదేశంలో కొల్లేరుసరస్సు అనే పెద్దమంచి నీటి సరస్సు ఉంది. ఇది కృష్ణాగోదావరుల డెల్టాలకు మధ్యగా తూర్పున బంగాళా ఖాతమునకు దగ్గరగా ఉంది. దానికి కొలనుదేశమని కూడా పేరు. కొలను రాజులు ఆంధ్రదేశ చరిత్రలో ప్రఖ్యాతమైన పాత్ర వహించారు. సుమారు 200 మైళ్ళ వ్యాప్తమైన కొల్లేటి సీమచుట్టూ లక్షల కొలది ఎకరాల భూమి సాగుబడిలోవుంది.

ఆంధ్రదేశంలో మానవచరిత్ర కనీసం 3,00,000 సంవత్సరాల పూర్వం నుండీ ఉండేదనీ చెప్పడానికి ఆధారాలు ఉన్నాయి. గోదావరినదీ లోయలో లభ్యమైన పురాతన శిథిలాలు దీనికాధారాలు. పాతరాతి యుగానికి చెందిన పనిముట్లు కర్నూలు, నాగార్జునకొండ ప్రాంతాలలో దొరికినాయి. కొత్తరాతి పనిముట్లు శిథిలాలు హైదరాబాదు మొదలైన దక్కను

ప్రాంతాలలో ఉన్నాయి. అలాగే నాగార్జునకొండ ప్రాంతంలో కూడా ఉన్నాయి. నాగార్జునకొండ లోయలో ఉండే కొత్తరాతి యుగపు మనుష్యులు వ్యవసాయానికి పనికివచ్చే పనిముట్లను ఉపయోగించేవారని తెలుస్తున్నది. క్రొత్త రాతియుగం తర్వాత ఇనుపయుగం ప్రారంభమైంది. ఈ యుగానికి చెందిన పనిముట్లు ప్రాచీన కాలంనాటి సమాధులలో దొరికినాయి. రాక్షసగుళ్ళు అని వ్యవహరించబడే సమాధులు చాలా ప్రాచీనమైనవి. వీనిని ఇంగ్లీషుభాషలో మెగాలిత్సు (Megaliths) అంటారు. ఇవి కృష్ణా, గోదావరి, చిత్తూరు, బళ్లారి జిల్లాలలో హైదరాబాదు, డోర్నకల్ మొదలగు ప్రాంతాలలో ఉన్నాయి. ఇవి కాక చిత్తూరు, కర్నూలు, అనంతపురం జిల్లాలలో ఇంకొక విధమైన సమాధిశవపేటికలు (తొట్టెలు) కనబడినాయి. కడప మండలములోని శంకవరం వద్ద కనబడిన శవపేటిక వంటిది సిరియాలో కూడ బయటపడినది. అనగా ఆనాడు ఆంధ్రదేశంలో ఉండే సమాధుల వంటివి దక్షిణఆసియాలో అనేక దేశాలలో ఉండేవని చెప్పవచ్చును.

ఆంధ్రదేశం భారతదేశంలోని అనేక సంస్కృతులకు సమ్మేళన నిలయంగా నిలిచింది అని చెప్పుకొన్నాము. ఆంధ్ర ప్రజలలోకూడ అనేక జాతుల ప్రజలు తరతరాలుగా కలసిపోయి ఉన్నారు. శారీరక రూపాన్ని పరిమాణాన్ని బట్టి కాని, ఆహార విహారాదుల ఆచార వ్యవహారాలను బట్టి కాని ఆంధ్రులలో అనేక జాతులవారి కలయిక కనిపిస్తుందని చెప్పవచ్చు. వారిలో ఆర్య, ద్రావిడ పద్ధతులు, ఆచారాలు సమ్మిశ్రితమై ఉన్నాయి. ఆంధ్రదేశంలో ఉండే ప్రజలలో ప్రోటో ఆస్ట్రోలాయిడ్ జాతికి చెందినవారు (ముఖ్యంగా చెంచులు మొదలగు కొండజాతులు ఆటవికజాతులు ఈ కోవకు చెందినవారు), మెడిటరేనియను శాఖకు చెందినవారు (తెలుగు బ్రాహ్మణులలో కొందరీ కోవకు చెందినవారు), ఈ విధంగా పెక్కు

జాతులవారు కలిసి ఉన్నారు. ఆంధ్రదేశంలోని తెలుగు భాష లేక ఆంధ్ర భాష ఆర్య ద్రావిడ కుటుంబాలు రెండింటికి చాల సన్నిహితంగా ఉన్న భాష కొందరు కొండజాతులు మాటాడు సవరభాష వంటి భాషలు, ముండా భాషల శ్రేణికి సంబంధించినవి ఉన్నాయి. తెలుగుభాష కూడా చేరిన ద్రావిడ భాషాకుటుంబమునకు బెలూచిస్థానంలోని బ్రహూయి భాషకును సంబంధం ఉన్నట్లు చరిత్రకారులు కొందరు చెప్పినారు. భాషా విషయం లోనే కాకుండ, సంస్కృతి విషయంలో కూడ ఆంధ్రదేశానికి ఇతర దక్షిణ ఆసియా రాజ్యాలకూ అత్యంత ప్రాచీన కాలం నుండీ సంబంధం ఉండేదని చెప్పవచ్చును. తెలుగు సంస్కృతిలో నాగపూజ చాల విస్తార మైన సంప్రదాయం. ప్రాచీనాంధ్ర ప్రజలలో నాగులు చాల ముఖ్యులు. పెర్సిపోలిస్ (పర్షియాలోని పట్టణం)లో అతి ప్రాచీన కాలంలో నాగపూజ ఉండేదని చరిత్రకారులు చెప్పుచున్నారు. అందువల్లన ఆంధ్రుల ఆచారానికి పారసీక ప్రజల ఆచారానికి అతి ప్రాచీన కాలంలో కొంత పోలిక ఉన్న దని చెప్పవచ్చును.

ప్రజలు

ఆంధ్రుల గూర్చిన ప్రస్తావన వేదకాలమునుండీ కానవస్తున్నది. ఐతరేయ బ్రాహ్మణములో ఆంధ్రులు పేర్కొన బడ్డారు. విశ్వామిత్రుడు తన ఏబది కుమారులను వారు తన యాజ్ఞ మీరినంతన శపించెననియూ వారే ఆంధ్ర పుళింద మూతిబ శబరాది జాతులవారనియూ ఐతరేయ బ్రహ్మణములోని ఐతిహ్యము వల్ల తెలుస్తున్నది. ఆంధ్ర శబ్దము సరియైనది కాదని అంధ్ర శబ్దమే సాధువని భావరాజు వేంకటకృష్ణారావుగారి వాదము. ఈ అంధులు ఆదిలో తుఖార జాతులతో పాటు ఆక్సునదీ తీరాన నివ సించినట్లు కొందరు చరిత్రకారుల అభిప్రాయం. అందువలన అంధ్రులు బెలూచిస్థానం, ఆఫ్ఘన్ స్థానం నుండి వచ్చిరని కొందరి వాదం. దాని

ననుసరించి ఆంధ్రులుకూడ మధ్య ఆసియా ప్రాంతీయులైన ఆర్యులని ఊహించవచ్చు. వారు క్రమంగా దక్షిణభారతంలో ఉన్న ఆదిమజాతులలో అనార్య జాతులతో పౌంఢ్ర, పుళింద, శబర జాతులతో కలిసిపోయి ఉండవచ్చును. కొంతకాలానికి గోదావరీ కృష్ణా నదుల మధ్య స్థిరనివాసం ఏర్పాటుచేసికొని ఆంధ్రసామ్రాజ్యాన్ని స్థాపించినారు. ఆ దినములలో ఆంధ్రులభాష ప్రాకృత భాషలలో నొకటిగా ఉండేది ఈ ఆంధ్రజాతికి చెందిన రాజులే ఆంధ్ర సాతవాహనులు. వారిలో నొకడైన హాలుడు ప్రాకృత భాషలో సప్తశతి యనుకావ్యాన్ని సంకలనం చేసినాడు.

ఆర్యులు భారతదేశానికి రావడానికి ముందు, ద్రావిడ జాతివారు అచ్చట నివసిస్తున్నట్లు చరిత్ర పరిశోధకుల వాదము. ఆర్యులకు ద్రావిడు లకు వర్ణంలో, ఆచార వ్యవహారాలలో భేదమున్నదనీ, ఆర్యులు శ్వేత వర్ణులనీ, ద్రావిడులు నల్లని రంగువారనీ, ఆర్యులు ద్రావిడులను ఓడించి వారిని దాస్యులుగా చేసికొనిరనీ చరిత్రకారులు చెపుతున్నారు. తెలుగు, కన్నడము, తమిళము, మళయాళము మొదలగు భాషలు ద్రావిడ భాషలని చెపుతున్నారు. తెనుగునకు దక్షిణభాష అని అర్థం చెప్పి, తెనుగువారు ద్రావిడ జాతికి చెందినవారని కొందరు వాదిస్తున్నారు. ఏది ఎటులున్నా ఆంధ్రభాష, తెనుగుభాష, తెలుగుభాష, ఒకటే అనీ, అది ఆర్య ద్రావిడ భాషలు రెండింటికీ సంబంధించినదనీ, చెప్పడానికి సందేహించ నక్కర లేదు

ఆంధ్రదేశంలో ఆర్య ద్రావిడ జాతులవారే కాక మంగోలియను తెగవారు (యక్షులు) శబరులు, నాగులు మొదలైన జాతుల ప్రజలు ప్రాచీన కాలము నుండి ఉంటున్నారు. ఆంధ్రదేశంలోని జక్కులవాండ్రు (యక్షులు) మధ్య ఆసియాలో ఉండే మంగోలియను జాతులవారై ఉండ వచ్చునని ఖండవల్లి వారు తమ ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి అను

గ్రంథంలో ఊహను తెలిపినారు. అట్లే శబరులనువారు దండకారణ్యములో ఉండుటచే గోదావరికి ఉపనదియైన శబరిగా పేరు వచ్చిందనీ నేడు శ్రీకాకుళం, విశాఖమండలాలలోని సవరలు వీరి జాతివారని చెప్తున్నారు. అది కాక అనాది కాలమునుండీ ఆంధ్రదేశంలో నాగజాతివారు ఉంటున్నట్లు చారిత్రకాధారాలు చాల ఉన్నాయి తెలుగుదేశం నాగుల భూమిగా వారి వల్లనే ప్రసిద్ధిపొంది యుండవచ్చును. ఆంధ్రదేశంలో నదులకూ ప్రదేశాలకీ ప్రజలకూకూడ నాగశబ్దం సర్వసామాన్యంగా కనబడుతుంది. నాగులేరు, నాగులపాడు, నాగాయలంక, నాగరాజు, నాగయ్య, నాగన్న, నాగమ్మ అనే పేర్లు విస్తారంగా కానవస్తాయి. బౌద్ధ గాథలలో, జైన సాంప్రదాయాలలో ఆంధ్రదేశానికి సంబంధించినపుడు నాగప్రసక్తి అక్కడక్కడా కావస్తుంది కృష్ణాతీరాన్ని నాగరాజు పాలించినట్లు బౌద్ధ గాథలలో ఉంది. జైన తీర్థంకరుడైన పార్శ్వనాథుని విగ్రహాలలో పడగలతో నున్న సర్పం శిరస్సుపైన ఉంటుంది. ఇట్టి జైన విగ్రహాలు అసంఖ్యాకంగా ఆంధ్రప్రదేశ్‌లో పెక్కుచోట్ల ఉన్నాయి. తెలుగుదేశంలో నాగపూజ బహుళ వ్యాప్తంగా ఉంది. నాగుల చవితినాడు పాములపుట్టలలో పాలు పోయుట, కార్తీకమాసంలో చేయు వీరభద్ర పూజలో కూడా నాగపూజా సాంప్రదాయమూ, తెలుగు నాటకనిపిస్తాయి. నాగులు సర్పపూజనే కాక వృక్షపూజను, ముఖ్యంగా వేపచెట్టు పూజను, చేస్తారు. వృక్షపూజ ఆర్యులలో కూడా వుండేది. వారు రావి, జమ్మి, మద్రి, తులసి మొదలగు వృక్షాలను పూజించే వారు, ఆంధ్రదేశంలో "ఈనాడు మనవారు రావిచెట్టునకును వేపచెట్టునకును కలిపి పెండ్లిచేసి ఒకే కుదురులో పెంచుట కానవచ్చును. ఇది ఆర్య నాగభావ సమ్మేళనమునకు చక్కని ఉదాహరణము"*

---

* ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం-ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి పుట 54.



# 1857 కు భూమిక

## పడాల రామారావు

తెల్లదొరలు, కొత్త పద్ధతుల్లో భారతదేశాన్ని పరిపాలించ ప్రారంభించారు. ఆర్థికరంగంలో వారిదోపిడీకి అంతులేదు. భారతీయ జీవనమంతా పిండి పారవేయబడిన చెరకు పిప్పిగా మార్చివేయబడింది ఎటు చూసినా ఎండిన చెరువులు, దండిగా కరువులు, మండే ఆకలి విలయ నాట్యం చేయసాగాయ్.

అసంతృప్తి అగ్నిహోత్రంగా మండిపోతున్నది. ఇకేక్షణంలోనన్నా భారతదేశంలో విప్లవం రావచ్చు. దేశమంతా ఆనాడొక అగ్నిపర్వతం. భారతజాతికి ఆనాడు విభేధాలు లేవు. ఉన్న విభేదమల్లా, ఎప్పుడు యీ జానకి త్రాడును ముట్టిద్దామనే ఎవరు ముట్టించాలనే శంకకూడా లేదు. మహా విప్లవంలో ఒక వ్యక్తి పాత్ర ఎంత? ఒకరు ముట్టిస్తే అంటుకునేది ఎంత కాలముంటుంది? ఫ్రెంచివిప్లవానికి మూలకారకులు రూసో, వాల్టేర్, డిడిరో లంటే మనం ఒప్పుకుంటామా? అమెరికా విప్లవానికి వాషింగ్టన్, లింకన్‌లే

కారణమంటే అంగీకరిస్తామా? ఒక్కడెప్పుడూ కారణంకాదు మహోగ్నులు మండటానికి.

అలా 1806లో రాయవేలూరు మండింది జానక్రిాడును అచట ముట్టించింది— మన భారతసిపాయిలు. 1857 భారతస్వాతంత్ర సమర పోరాటానికి అది భూమిక అయిందనికూడా మనం చెప్పుకోవచ్చు.

1806లో గవర్నరు-జనరల్ సర్‌బార్లో. మదరాసు గవర్నరుగా విలియం బెంటింక్ ఉంటున్నాడు. వీరి అనుమతితోనే రాయవేలూరులో సర్వసైన్యాధికారిగా ఉంటున్న జాన్‌క్రేడక్, ఒక ఆర్డరును జారీచేసాడు. భారతసిపాయిలు తమ గడ్డాలను కత్తిరించుకోవాలట. తలపాగాలకు బదులు తోలుటోపీలను ధరించాలట, మిలటరీ ప్రదర్శనల్లో తమ సంస్కృతికి చిహ్నాలైన చెవులపోగులుగాని, నుదుట తిలకాలుగాని ఎవడూ ధరించకూడదట

ప్రఖ్యాత బ్రిటిషుచరిత్రకారులైన థారన్‌టన్, విల్సన్‌లే యీ చర్యలను ఖండించారు.

ఇవి మనకిప్పుడు స్వల్పవిషయాలుగానే కనబడవచ్చు. నూటఇరవై ఏండ్ల క్రితంరోజుల్లోకి వెడితే మనకొకటి బోధపడుతుంది. ఆనాడు గడ్డం భారతసిపాయి దర్పానికి చిహ్నం, తలపాగా అతడి ఠీవికి దర్పణం. అట్టి తలపాగాకు బదులు పంది చర్మాన్నో, గోవు చర్మాన్నో హిందూ ముస్లిం సిపాయిలు ధరించాలంటే ఎంతటి కల్లోలానికి దారితీస్తుందో ఇట్టేఊహించుకోవచ్చు.

ఇక గడ్డం అంటారా? ఇప్పుడైనా మీరు ఏ తిరుపతి మొక్కు ఉన్నవాని గడ్డం పైనన్నా చేయివేయండి చూద్దాం-అతడి తల తెగి క్రింద పడ్డా నీ చేయి మాత్రం అతడి గడ్డంపై పడదు, పడనీయడతడు.

మరి నూటఅరవై ఏండ్ల క్రితం సంగతేమిటి? పరమ పవిత్రంగా ఎంచుకునే విభూతి, త్రిచూర్ణ తిలకాలను చెరుపుకొనే మూఢుడుంటాడా? వారికి అనుమానం కలిగింది. యీ తెల్లహంతకులు తమను మతహీనులను చేసి క్రైస్తవమతానికి కట్టబెట్టగలరని.

అసంతృప్తి పెల్లుబికింది. దాన్ని మొగ్గలోనే తుంచివేయాలని కల్నల్ క్రేడక్ ఒక ప్రచారాన్ని లేవనెత్తాడు-రాయవేలూరులో ఉంటున్న వేలాది టిప్పుసుల్తాన్ కుటుంబీకులే దేశీసిపాయిల్లో యీ అసంతృప్తిని రెచ్చగొట్టారని. అంతేకాదు. సుల్తాన్ కుటుంబాలను కలత్తాకు పంపి వేశాడు కూడా.

విల్సన్ అంటాడూ– "యీ అసంతృప్తికి టిప్పు కొడుకులు గాని, వారి కుటుంబీకులు గాని కారణమైనట్టు ఎచ్చటా దృష్టాంతరాలు కనబడ లేదు" అని.

తెల్లదొరల యీ మోసాన్ని గమనించారు-మన సిపాయిలు. ఉవ్వెత్తుగా 1806 జూలై 10న తిరగబడ్డారు. మొట్టమొదట రాయవేలూరు కోటను స్వాధీనం చేసుకున్నారు. కనబడిన తెల్లసైనికునీ, అధికారినల్లా నరికి పారవేసారు. రెండు తెల్ల పటాలాల్నే తుడిచిపెట్టేసారు. అందులో 14మంది ఆఫీసర్లు కూడా ఉన్నారు. ఇంకేముంది? పరిస్థితులు తలక్రిందులై పోయాయ్. క్రేడక్ తాను చిచ్చంటే పెట్టాడుగాని దాన్ని ఆర్పడం వాడి తరం కాకపోయింది. క్షణాలపై ఇతర ప్రాంతాలనుండి అశేష తెల్లసైనికులు దిగి, భారతీయ సిపాయిలను చెప్పనలవిగాని చిత్రహింసలకు గురి చేసారు. అందరినీ నిరస్త్రులను గావించి, ఖైదుకోట్లలోకి త్రోసి యమ బాధలను పెట్టారు. అయినా రాజుకున్న ఆ రాక్షసిబొగ్గు చల్లారలేదు. 1807లో గవర్నరు-జనరల్‌గా వచ్చిన లార్డుమింటో, యీ వేడి దేశమంతా ప్రాకవచ్చునని భయపడి పూర్వపు మూర్ఖ అధికార్ల ఉత్తర్వులన్నీ రద్దు

చేసి వేసాడు. ఇంగ్లండులోని యీస్టిండియా కంపెనీ అధికార్లు బెంటిక్‌నీ, క్రేడక్‌నీ ఉద్యోగాల నుండి డిస్మిస్‌చేసి, ఇంగ్లండుకు రప్పించివేసారు

అలా అప్పటికి ఆ సిపాయిల విప్లవం చల్లారినట్టే కనుపించింది. కాని మరల మూడేండ్లలోనే తెలుగుదేశంలోని బందరు విప్లవానికి రంగస్థలమైంది. 1809 రోజుల్లో బందరు బ్రిటిషర్లకు అతికీలకమైన రేవుస్థలం. సికింద్రాబాద్, వేలూరు కేంద్రాల్లో నున్న సిపాయిలకు దుస్తులు ఇచ్చట తయారయ్యేవి. మదరాసులో ఆనాడు బ్రిటిషుసైనికులే బ్రిటిషు ఆఫీసర్లపై తిరుగబడ్డారు

తీక్ష్ణమైన ఎండలవి సాధారణసైనికునికి సరైన జీతభత్యాలు లేవప్పుడు. ఎండలకు తాళలేక అజీర్ణరోగాలతో, కలరాతో తెల్లసైనికులు చనిపోతున్న సమయమది. అప్పుడే వారు తమదుర్భర పరిస్థితులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసారు. తెలుగు సిపాయిలు వారిని ఆదుకున్నారు. తమతోటి సైనికులకు సహాయం చేయడానికి వారానాడు ఎన్నెన్ని సాహస కార్యాలుచేసారో లెఫ్టెనెంటువిల్సన్ మదరాసు సైన్య చరిత్రలో ఇలా రాసాడు;

"కొంత మందికి ఆశ్చర్యంగా కనుపించినప్పటికీ జరిగినదేమంటే, ఇంగ్లీషు సైనికులు పులికాటమీదుగా సెంట్‌థామస్‌మౌంటుకు ఒక తపాలా సర్వీసును నడిపారు. దేశీసిపాయిలు రన్నర్లవేషం వేసుకొని, తోటి తెల్ల సిపాయిలకు ఉత్తరాలు మోసుకొచ్చేవారు".

ఈ ఉపద్రవాన్ని గమనించిన సర్ జాన్‌మాల్కమ్ మదరాసు నుండి ఓడపై సైనికుల్ని తెచ్చి బందరులో తిరుగుబాటు చేసిన తెలుగు సిపాయీల నందరినీ కర్కశంగా శిక్షించి అణచివేసాడు.

1824 వచ్చింది. భారతదేశాన్ని కొల్లగొట్టడంలో దొరల దుర్దాహం ఆగక, బర్మాను కబళించాలని యుద్ధాన్ని ప్రకటించారు. కలకత్తాకు 15

మైళ్ళలోనున్న భారక్‌పూర్‌లోని 47వ దేశీకాల్బల దళాన్ని రంగూన్‌కు ప్రయాణం కమ్మని ఆజ్ఞల్ని జారీచేసారు. ఆ రోజులలో దేశీసిపాయిలకు సముద్ర ప్రయాణమంటే సాంప్రదాయ విరుద్ధం. అందుకని తాము సైన్యంలో చేరేటప్పుడు తెల్లదొరలచే ఒక ఖరారుపత్రం రాయించుకున్నారు. అందులో సముద్ర ప్రయాణాన్ని దేశీసిపాయీలచే చేయించమని దొరలు రాసిచ్చారు. ఆ బారక్‌పూర్ పటాలానికి అధికారి సర్ ఎడ్వర్డ్ పాగెట్. వాడొట్టి నిరంకుశుడు. దేశీసిపాయిలలోని యీ సాంప్రదాయాన్ని అతడు సంకుచితత్వం క్రింద కాలదన్నాడు. బర్మా ప్రయాణంకట్టి తీరవలసిందే నని ఉత్తర్వుచేసాడు. కాని దేశీసిపాయిలు నిరాకరించారు.

అంతే, ఆ నరరూపరాక్షసుడు తక్షణం శిబిరాల్లోంచి, రెండు తెల్ల పటాలాల్ని, ఒక సాయుధపటాలాన్ని పిలిపించాడు. నిరాకరించిన ఆ వంగ సిపాయీలపై గుండ్ల వర్షం కురిపించాడు. నిరాయుధుల్ని నిలువునా కాల్పించివేసాడు. ఫిరంగిగొట్టాలలోకి వారి నాయకుల్ని క్రుక్కి ప్రేల్పించి వేసాడు. వందల సంఖ్యలో యీ మారణహోమం జరిగిపోయింది. కాల్పు లలో చావగా మిగిలిన సిపాయీలను, కోర్టు మార్షలు చేసి, గుత్తులు గుత్తులుగా చెట్లకుకట్టి ఉరితీసివేసారు. మొత్తం పటాలమే ఆహుతై పోయింది. తరువాత ఆ '47' శబ్దాన్నే తమ రికార్డుల్లోంచి తొలగించి వేసారు.

ఆనాటినుండి బ్రిటిషు ఆఫీసర్లు భారత సిపాయీలను హీనంగా చూడసాగారు. పెరేడులలో, శిబిరాలలో ఎచ్చట చూసినా అవమానాలే వారికిచ్చే జీతమా?- తిండికి సరిపోదు. నెలకు ఏడు రూపాయలు ఏమి సరిపోతాయ్? అశ్విక సిపాయికి మాత్రం ఇరవై ఏడు రూపాయలు ఇచ్చే వారు. అయితే గుర్రాన్ని అతడే తెచ్చుకోవాలి. దానా కూడ అతడే పెట్టు కోవాలి. ఎంత దుర్భరమైన బ్రతుకో ఊహించండి! అదే కాలంలో తెల్ల

సైనికులలో ఒక సుబేదారుకు రు. 250 ల జీతం, అలవెన్సులు, ఇండ్ల అద్దెలు, ఉచిత దుస్తులూ ఇచ్చేవారు. ఒకేపనికి జీతాలలో అంతరాలు, ఏమిటీ నీతి? సిపాయిలు తీవ్రంగా ఆలోచించసాగారు. వారికి నిద్ర పట్టడం లేదు. తాము సైన్యాలలో ఉన్నది రెండున్నర లక్షలమంది. తెల్ల సిపాయిలు నలభై వేలే. తలచుకుంటే, ఒక్కొక్కర్నీ అయిదుగురు ఏకమై చప్పరించి వేయవచ్చు. 1839 ఆఫ్ఘన్ యుద్ధంలో బ్రిటిషుసేన అజేయమన్నది బూటకమని తేలిపోయింది. ఆ యుద్ధానికి దేశీసిపాయిలు వెళ్ళ నిరాకరించారు. అలా చేసినవారిని దొరలు చెరసాల కవాటాల్లోకి త్రోసివేసినా ఒక కఠిన సత్యం మాత్రం వారికి బోధపడింది దేశీసిపాయిలు పాల్గొనని ఏ యుద్ధంలో తాము ఇరుక్కున్నా ఓటమి తథ్యమని. అంతలో సింధుయుద్ధ మొచ్చింది. ఆనాడు పంజాబు, సింధులు విదేశ ప్రయాణం క్రిందే లెక్క. అయితే యీసారి తాము విదేశప్రయాణం చేయమని భీష్మించలేదు. కాని ప్రయాణపు భత్యాలను తెల్ల సిపాయీలకు ఎలా యిస్తున్నారో తమకూ అటులే ఇమ్మని కోరారు. దొరలు నిరాకరించారు. మన సిపాయిలూ నిరాకరించారు- సింధుకు పోమని. అంతే నోరెత్తలేదు దొరలు. దొరలబలహీనత ఇప్పుడు స్పష్టంగా దేశీసిపాయీలకు అవగతమై పోయింది. స్థిరనిర్ణయానికి వచ్చేసారు సోదర సిపాయిలకు రహస్యంగా కబుర్లు వెళ్ళిపోతున్నాయ్. దేశీ సిపాయిల ముఖాలను చూస్తుంటే తెల్లదొరలకు శరీరాలు కంపించి పోతున్నాయ్.

అంతలో మరల బర్మాయుద్ధం వచ్చింది. ఇదే చరిత్ర ప్రసిద్ధి చెందిన రెండవ బర్మాయుద్ధం. రాయబారానికని వెళ్ళిన లాంబర్ట్. బర్మా చక్రవర్తి ఓడను వశపర్చుకొనడం ద్వారా కయ్యం తెచ్చుకొని 1852 ఏప్రిల్ 14 న తొలిసారిగా బర్మాను ఆక్రమించుకున్నాడు. అయితే యీ యుద్ధానికి కూడా భారత సిపాయిలు అవసర మొచ్చారు. మళ్ళీ సంప్ర

దాయానికి విరుద్ధంగా బెంగాలు సిపాయిలు సముద్ర ప్రయాణం చేయాలి. వారికి మొదటి బర్మాయుద్ధం స్మృతిపథం నుండి చెదిరిపోలేదు.

అప్పుడు గవర్నరు-జనరల్ డల్‌హౌసీ, సంస్థానాధిపతుల నంద రినీ కబళించిన హస్తాలతోనే యీ సిపాయీలనూ కబళించాలనుకున్నాడు. సంస్థానాధిపతుల్లో పిరికికి స్థానముంది. కాని సిపాయీలకు అపూర్వమైన ధైర్యసాహసాలు కంచుకవచాలు. మరల వారినే డల్‌హౌసీ బర్మా వెళ్ళ తీరాలని ఆజ్ఞాపించాడు. ఈసారి ఇంకా ఖండితంగా నిరాకరించారు సిపా యిలు. ఇక చేయునది లేక డల్‌హౌసీ తలవొంచాడు. ఇదే తెల్లదొరలకు మొదటి పరాజయం. అదే భారతీయ సిపాయిలకు తొలి విజయం.

కాని డల్‌హౌసీ నిద్రపోలేదు. తోకాడిస్తూనే వీలు దొరికినప్పుడు కాటు వేయ చూస్తున్నాడు. అధికారాన్నంతనూ కత్తిమొనపై నిలుపుకొని బహుముఖ నిర్బంధాన్ని ప్రవేశపెట్టాడు. వారి సాంప్రదాయాలలో, ఇష్టా నిష్టాలలో, మత సంబంధాలలో బాహాటంగా కలుగజేసుకోజొచ్చాడు. ప్రతి ఫలంగా అతడికి హైదరాబాదు నుండి ఘాటైన హెచ్చరిక వచ్చింది. మాటలలో కాదు- తుపాకితో! ఆ హెచ్చరిక నిచ్చినవారు హిందువులు కాదు. మహమ్మదీయులు కాదు! కాదు- పదహారణాల భారతీయులు.

ఎదురు తిరిగారు. ఎందుకు? నక్కజిత్తుల కుతంత్రాలతో ఒక సైనిక పత్రాన్ని కల్నల్ మెకంజీ విడుదల చేసాడు. హైదరాబాదు లోని బొలారం నాటి సైనిక కేంద్రం. ఆ ఆజ్ఞాపత్రం సిపాయిల మొహరం పండుగలో జోక్యం చేసుకొంది. అంతే! తిరగబడ్డారు ముస్లిం సిపాయీ సోదరులు. అప్పటికే హిందూ-ముస్లింభేదాలు అంతరించిపోయాయ్. నూరు గొడ్లను తిన్న రాబందు ఒకే దెబ్బకు సఫా! మెకంజీని పట్టుకున్నారు- సిపాయిలు. హడలిపోయాడు. డల్‌హౌసీ నిలబడ్డ ఫలంగా ఆ సైనిక

పత్రాన్ని రద్దుపరిచాడు. లేదా తన కల్నల్ మెకంజీ శవం ఇంగ్లండుకు ప్రయాణం కట్టేది! అది డల్‌హౌసీకి రెండో పరాజయం.

తాను దత్తత స్వీకార శాసనాన్ని అమలు జరిపి ఎన్ని సంస్థానా లను కొల్లగొట్టి ఎంత ధనాన్ని ఇంగ్లండు చేరవేసాడు? ప్లాసీ యుద్ధంతో క్లైవుకు ఇంగ్లండులో ఎంత ప్రతిష్ఠ వచ్చిందో దత్తత స్వీకార నిషేధ శాసనంలో అంతటి ప్రతిష్ఠను తెచ్చుకొన్న డల్‌హౌసీ సాధారణ సిపాయీల ముందు మంత్రశక్తిని కోల్పోయిన మాంత్రికుడై పోయాడు.

1855 అలా గడిచిపోయింది. 1856లో అతడు లార్డ్ కాన్నింగ్‌కు చార్జి అప్పగించి ఇంగ్లాండుకు వెళ్ళిపోయాడు. పోతూ భారతఖండాన్ని ఓ అగ్నిగుండంగా తయారుచేసి మరీపోయాడు. ఏ మూలనుండి ఓ నెరుసు వచ్చి పడ్డా ఆ అగ్నిగుండం మండ సిద్ధంగా ఉంది అయితే ఆ నెరుసు సిపాయిల నుండే వచ్చిపడింది. ఈ సంఘటన భారతావనినంతనూ ఊపి వేసిన విప్లవ ఝంఝూమారుతమై సీమదొరలకు సింహస్వప్నమై, మొదటి భారత స్వాతంత్ర్య సమరంగా చరిత్రలో ప్రసిద్ధమైంది.



# జాతీయ నిర్మాణము

## డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య

దేశముయొక్క రాజకీయ పారతంత్ర్యమును నిర్మూలింపవలెననే యుద్దేశ్యము జాతీయ మహాసభ కున్నప్పటికీ కేవలము ఆ యుద్దేశమే దాని పుట్టుకకు కారణము కాదు.

ఈ సంస్థమూలముననే జాతీయ వికాసమునకు సంబంధించిన అనే కోద్యమములు వ్యాప్తిలోనికి వచ్చినవి. ఈ మహాసభ పుట్టక పూర్వము యాభై సంవత్సరముల పైనుండి కూడా జాతీయ నిర్మాణము ప్రారంభ మైనది. నిజమునకు రామమోహనరాయల వారి కాలమునాటికే జాతీయ జీవనము సర్వతోముఖముగా విజృంభించినది. రామమోహనరాయల నొక విధముగా భారత జాతీయ ప్రవక్త అనీ, ఆధునిక భారతవర్షమునకుమూల పురుషుడినీ కూడ చెప్పవచ్చును. ఆయన భావాలు ఉన్నతములు; దృష్టి విశాలము. ఆ రోజులలోని మత సాంఘిక విషయములే ఆయన సంస్కరణ ప్రయత్నములకు మూలకందములు. కాని ఆనాడు భారతదేశమున

జరుగుతున్న రాజకీయాపరాధము లాయనదృష్టి నాకర్షించకపోలేదు. వాటిని సాధ్యమైనంత తొందరలో నిర్మూలించుటకు కూడ ఆయన అనేక ప్రబల ప్రయత్నములు చేసి యుండెను. రామమోహనరాయలు 1776 లో జన్మించి 1833 లో బ్రిస్టల్ నందు మరణించెను. హిందూదేశములో సహగమనమును (సతి) మాన్పించుటకును, పాశ్చాత్యవిద్యను ప్రవేశ పెట్టుటకును ఆయన చేసిన కృషి చిరస్మరణీయము. 1830 ప్రాంతములో పాశ్చాత్యవిద్యను గూర్చి చేసిన వాదప్రతివాదములలో రామమోహన రాయలు చేసిన కృషివలననే లండనులోని కోర్టు ఆఫ్ డైరెక్టర్ల సిఫారసు లకు వ్యతిరేకముగా కూడ విలియం బెంటింకు ప్రభువు అనుకూలమైన నిర్ణ యమునకు రాగలిగినాడు. చరిత్ర ప్రసిద్ధమైన ఈ విషయము రామ మోహనరాయలకు పాశ్చాత్య విజ్ఞానమునందు గల పక్షపాతమును, ఆ కాలపు ప్రజలపైన ఆయనకు గల అమోఘమైన పలుకుబడినీ తెలియ జేస్తూన్నది రామమోహనరాయలు తన అంత్యదశలో ఇంగ్లండునకు ప్రయాణము కట్టినాడు. ఆ ప్రయాణములో జరిగిన ఈక్రింది సంఘటనము వలన ఆయనకు గల స్వాతంత్ర్యేచ్ఛ బోధపడగలదు. "కేప్ ఆఫ్ గుడ్ హోప్" దగ్గర స్వాతంత్ర్యపతాక మెగురుతూన్న ఒక ఫ్రెంచినౌక రామ మోహనరాయల దృష్టి నాకర్షించినది. వెంటనే ఆయన తనను తననౌకలో నుండి ఫ్రెంచినౌకకు కొంపోవలసిందని నావికులను తొందరపెట్టినాడు. ఆయన ఫ్రెంచియోడ ఎక్కి స్వాతంత్ర్య పతాకను చూచి ముగ్ధుడై "స్వాతంత్ర్య పతాక్ కీ జయ్, జయ్, జయ్" అని బిగ్గరగా మూడుసార్లు జయధ్వానములు చేసెను. రామమోహనరాయలు ముఖ్యముగా లండనులో మొగల్ చక్రవర్తి పక్షమున పనిచేసేందుకు రాయబారిగా ఇంగ్లండు వెళ్ళి నాడు. కాని అప్పుడు భారతీయులను బాధిస్తూన్న కొన్ని కష్టములను గూర్చి పార్లమెంటు కమిటీ యెదుట మనవిచేయుట కాయనకు మంచి అవ కాశము కలిగినది. ఆయన భారతదేశపు రెవిన్యూ పరిపాలనము, న్యాయ

పరిపాలనము, భౌతిక స్థితిగతులను గూర్చిన మూడు నివేదికలనూ పార్ల మెంటువారి కందించెను. ఆయనకు ఈస్టిండియా కంపెనీవారు గొప్ప విందుచేసి గౌరవించినారు. 1832 వ సంవత్సరములో చార్టరు చట్టము పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడు, అచట్ట మంగీకరింపనియెడల తాను ఇంగ్లండు పౌరుడుగా నుండుట విరమించుకొని, అమెరికాలో నివాసస్థాన మేర్పరచుకొందునని ఆయన ప్రతినపట్టెను. ఆయన కాలములో ముద్రణా లయములపైన నిర్బంధ విధానము చాలా ఎక్కువయినది హేస్టింగ్సు ప్రభువు గవర్నరు జనరలుగా వచ్చి ముద్రణా నిరోధక శాసనములను కొంతవరకు సడలించి భారతపత్రికా ప్రపంచమునకు మహోపకారము చేసి నాడని సంతోషిస్తూండగనే; 1823 లో సివిల్‌సర్వీసు ఉద్యోగి జాన్ ఆడమ్ గారు తాత్కాలిక గవర్నరు జనరలై తిరిగి యెప్పటి నిర్బంధ విధానమును సాగించినాడు. దీని ఫలితముగా "కలకత్తా జర్నల్" పత్రికా సంపాదకుడు బక్కింగ్‌హామ్ గారు రెండునెలల నోటీసుతో ఇండియా నుండి ప్రవాసమునకు పంపివేయబడెను. ఆయన సహచరుడు సాన్‌ఫర్డు ఆర్‌నాట్ గారిని పత్రికా కార్యాలయములోనే అరెస్టు చేసి సీమకు పోయే పడవలో ప్రభుత్వము వారు వెంటనే పంపివేసినారు. పరిపాలనా విధానము నుగూర్చియే కొన్ని విమర్శనములు చేసినంత మాత్రమున వారిరువురకును కలిగిన ఆపద ఇది.

1823 వ సంవత్సరము మార్చి 14 వతేదీని జారీచేయబడిన అత్యా వసర ముద్రణా శాసనము (Press ordinance) ప్రకారము ఆంగ్లో ఇండియన్ పత్రికలు, ఇండియన్ పత్రికలు అనే భేదము లేకుండ భారత దేశములోని అందరు పత్రికాధిపతులును, అందరు ప్రకాశకులను లైసెన్సు లను తీసుకోవలసిన నిర్బంధ మేర్పడినది. అప్పటినుండి పత్రికలపైన "నిగా" కూడా చాలా యెక్కువైనది. ఈ అత్యవసర శాసనము అప్పటి

'లా' ప్రకారము సుప్రీమ్‌కోర్టులో ప్రకటింపబడిన 20 రోజులలోనే తొందరగా వెలువరింపబడినది.

రామమోహనరాయలు ఈ శాసనమును రద్దు చేయించుట కిద్దరు వకీళ్ళను పెట్టి వాదింపచేసెను. కాని ఆ ప్రయత్నము వ్యర్థమైనది. అందుపై ఇంగ్లాండు రాజు గారికొక మహజరు అర్జీని దాఖలు చేయించెను. అదికూడ ప్రయోజనకరము కాలేదు. కాని ఆ ప్రయత్నబీజము 1835 లో సర్ చార్లెస్ మెట్‌కాఫ్ గారు పత్రికల కిచ్చిన స్వాతంత్ర్య మూలకముగా ఫలప్రదమైనది రామమోహనరాయ లింగ్లాండులో నుండగనే సహగమన నిషేధమును గూర్చి ఆయన ప్రతిపక్షులు చేసిన అప్పీలు పార్లమెంటులో త్రోసివేయబడుటయు, చార్టరు చట్ట మంగీకరింపబడుటయు జరిగినవి.

డల్‌హౌసీ ప్రభువు కొందరు సంస్థానాధిపతులు సంతతి లేక మరణించగా వారి భార్యలకు దత్తతాధికారము లేదని ప్రకటించి వారి రాజ్యములను ప్రభుత్వములో బేవారసుఆస్తి క్రింద కలుపుకోవడమే రాజ్యాంగ తంత్రముగా నవలంబించినప్పుడు వచ్చిన తిరుగుబాటు "సిపాయి పితూరీ అని కొందరిచే వ్యవహరింపబడుతూన్నది. ఆ కథ అంతయును అందరికిని బాగుగా తెలిసిన విషయమే. తిరుగుబాటు అణచివేయబడిన వెంటనే 1858 లో విశ్వవిద్యాలయములును, 1861, 1868 సంవత్సరముల మధ్య హైకోర్టులును, శాసనసభలును ఇండియాలో నిర్మింపబడినవి. పితూరీకి ముందు కొద్దికాలము క్రిందనే సంఘసంస్కరణ సంబంధమైన వితంతు వివాహ చట్ట మంగీకరింపబడినది. 1860 ప్రాంతములలో పాశ్చాత్య భావాలతోను, పాశ్చాత్య విజ్ఞానముతోను భారతదేశమునకు సన్నిహిత సంబంధ మేర్పడినది. న్యాయవిచారణ చట్టనిర్మాణములందు నూతనశక ప్రారంభ చిహ్నములుగా పాశ్చాత్య న్యాయసంస్థలును, పార్లమెంటరీ పద్ధతులును ఏర్పాటు చేయబడినవి. పాశ్చాత్య సభ్యతతో- కలిగిన సంఘట్ట

నము వలనను, సంసర్గము వలనను భారతీయుల విశ్వాసములలోను, మానసిక ప్రవృత్తులలోను తీవ్రమైన పరివర్తనము కలుగక తప్పినది కాదు రామ మోహనరాయలచే చల్లబడిన మత సంస్కార బీజములు కొద్ది కాలములోనే దేశమందంతటను వ్యాపించినవి. రామమోహనరాయల అనంతరం ఆయన అడుగుజాడలలో కేశవచంద్ర సేనుడు బ్రహ్మసమాజ ధర్మ ప్రచారము సాగించి, ఆ సిద్ధాంతముల కొరక నూతన సాంఘిక వికాసము కల్పించినాడు. ఆయన మద్యపానము చేయవలదని బోధిస్తూ, ఇంగ్లాండు లోని మద్యనిషేధ సంస్కర్తలతో సానుభూతిగలిగి పనిచేసెను. 'బ్రహ్మ సమాజ వివాహ చట్టము' అని పిలువబడు 1876 వ సంవత్సరపు 3-వ చట్ట మంగీకరింపబడుటకు చాలవర కీయనయే బాధ్యుడు. ఆ చట్టముక్రింద క్రిస్టియనులు కానివారి కొరకవిధమైన సివిలు వివాహ పద్ధతి యేర్పాటు చేయబడెను. ఎవరయినను సరే, హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, పార్శీ, జ్యూసంఘములలో నేసంఘమునకును తాము చెందమని ప్రకటించు కొనిన చాలును. వా రీచట్టము క్రింద వివాహము చేసికొనవచ్చును. ఈ చట్టమువలన బాల్యవివాహము నిషేధింపబడినది. బహుభార్యాత్వము శిక్షార్హము చేయబడినది. వితంతు వివాహములు, వర్ణాంతర వివాహములు అంగీకరింపబడినవి. బాలికల వివాహ వయస్సు ఎక్కువ చేయవలెనని కేశవచంద్ర సేనుని కోరిక. అందుకోసమాయన 1872 లో బాలికల వివాహ వయస్సు 14 ఉండవలయునని నిర్ణయిస్తూ ఒక బిల్లు కూడ తయారుచేసియున్నాడు.

కొద్దికాలములోనే బ్రహ్మసమాజములో చీలికలు ప్రారంభమయినవి. కూచి బీహారు మహారాజునకు ఈడురాని కేశవచంద్ర సేనుని కుమార్తెనిచ్చి వివాహము చేయడమే ఈ చీలకకు మూలకారణము. ఇందువలన కేశవ చంద్ర సేనుని అనుచరులలో పెద్ద తిరుగుబాటు బయలుదేరినది. వారందరును కలసి ఆనందమోహనబోసు నాయకత్వమున "సధర్మ సమాజ"

మనే పేరుతో బ్రహ్మసమాజ మతమునందు వేరొక కక్షను లేవదీసిరి ఈ ఆనందమోహన్ బోస్ తరువాత 1875 లో జాతీయ మహాసభ కధ్యక్షు లగుట సంతోషకరమైన విషయము. వంగదేశ బ్రహ్మసమాజము దేశమంతటను ఏదో యొక రూపములో ప్రతిబింబించినది. అది పూనాలో యమ్. పి రనెడే గారి నాయకత్వమున "ప్రార్థన సమాజ" రూపమును పొందినది. ఈ రనెడే గారు ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమము చాలా కాలము వరకు కాంగ్రెసు కనుబంధముగా పనిచేసింది. కాని ఇది దేశీయుల పూర్వాచారముల పైనను, సంప్రదాయ విశ్వాసముల పైనను కొంత నిరసనభావము, తిరుగుబాటు కలిగించినది. ఇది పాశ్చాత్య సంస్థల మీది వ్యామోహమున జన్మించి దీనితో సన్నిహిత సంబంధము గల రాజకీయ ప్రతిష్ఠ వలన వర్ధిల్లినది. జాతీయ సంప్రదాయ విరుద్ధములైన ఇట్టి సంఘ సంస్కరణోద్యమములు పెడదారులు త్రొక్కకుండ చూచుటకు దేశములో కొంత ప్రతిరోధము కలుగుట సహజము. కాబట్టి పాశ్చాత్యవిద్యతో వచ్చిన ఈ అనార్య సంప్రదాయములను, విపరీత సిద్ధాంతములను నిరోధించి అవసరమైనంతవరకు సవరించుటకు పశ్చిమోత్తరదెసను ఆర్యసమాజమును, దక్షిణాదిని దివ్యజ్ఞాన సమాజమును బయలుదేరినవి. ఈ రెండును గొప్ప జాతీయోద్యమములే. అందులో ఆర్య సమాజము మరీ ఎక్కువగా దేశాభిమానమును పురస్కరించుకొని పనిచేసినది. అది వేదాల అధికృతను ఒప్పుకొన్నది. అవి ప్రమాదరహితములని కూడ అంగీకరించినది. కాని అంత మాత్రాన సంఘసంస్కరణమునకు ఆర్యసమాజ మతము అడ్డు తగులలేదు. కాబట్టి అది మన పూర్వ సంప్రదాయములలోని మంచిని గ్రహించి, కాలానుగుణమైన మార్పులతో భారతజాతిని వీర్యవంతముగా చేసినదని చెప్పవచ్చును. బ్రహ్మసమాజము విగ్రహారాధనము, బహుభార్యాత్వము, బహు దేవతారాధనము మొదలగు దురాచారముల పైన కత్తి దూసినట్లే ఈ ఆర్యసమాజ మతము కూడ అనేక మూఢ విశ్వాసములను, దుష్టా

# పౌరత

## గొల్లపల్లి నాగభూషణ శర్మ

పౌరత పౌరుని బాధ్యతలకును, హక్కులకును సంబంధించినది. పౌరుడు, పురము, సమాజము అను పదములు పరస్పర సంబంధము కలవి. పురము, సమాజము లేక పౌరత లేదు. సమాజము పౌరతకు మూల స్తంభము, సామాజిక జీవితములో పౌరత ఒక అంశము అని చెప్పవచ్చును. పౌరులు లేని పురముగాని, సమాజము గాని ఉండనేరవు. అట్లే ఒక సమాజమునకు సంబంధించి లేని పౌరతకూడ నిరాధారమును, నిరర్థకమును అగును. పురజీవనములోను, సమాజజీవనములోను పాల్గొనుట పౌరతయొక్క ముఖ్య లక్షణము.

కాని, పురములలోను, సమాజములోను గలవారి నందరిని పౌరులనుటకు కూడ వీలులేదు. పురములో నివసించుచుండుట ఒక్కటే పౌరతను ఆపాదించజాలదు. పౌరతకును, సమాజమునకును అవినాభావమైన సంబంధము కలదు. ఈ సంబంధము వల్లనే పౌరజీవనము అర్థవంతమగును.

సమాజము కేవలము కొంతమంది ప్రజల సముదాయము మాత్రమే కాదు. వ్యక్తుల ప్రత్యేకత కంటె సమష్టిభావమే సమాజమునందు ప్రధానమైనది సాధారణముగ మానవుని సంకల్పము వ్యక్తిగతమే అయినను, వ్యక్తులందరిలోను కలసి ఒక సాధారణ సంకల్పము ఉండుటకు కూడ అవకాశము కలదు. వ్యక్తులు విడివిడిగ పరిశీలించి చూచినచో వారి అభిరుచులలోను, ఆచారములోను భేదములును, వైషమ్యములును అగపడును. పైకగపడు ఈ వ్యత్యాసముల వెనుక నిగూఢమైనట్టి సాధారణ సంకల్పమొకటి కానుపించును. ఇదే నిజమైన మానవ సంకల్పము. అప్రధానములైన వ్యక్తి భేదములను మరచితిమేని మానవుల ఏకతయు, సంకల్పము యొక్క నిత్యతా, సాధారణతలును గోచరము కాగలవు. సామాజిక జీవనమునకు మానవుల ఈ సాధారణ సంకల్పమే ఆధారము.

ఈ సంకల్పము పరమ స్వతంత్రమైనది. ఎట్టి ఇతర ఆధికారమునకును ఇది లోబడదు. తనకు తానై ప్రవర్తించు ఈ సంకల్పము యొక్క స్వాతంత్ర్యము శాశ్వతమైనది.

మానవ సమిష్టిగత సంకల్పములకు సమాజములు దర్పణముల వంటివి. వ్యక్తికిగాని సంఘమునకు గాని సంకల్పమే అంతశ్శక్తి. సంఘముదృష్ట్యా వ్యక్తుల మధ్యగల వైషమ్యములు అప్రధానములు. మానవుల సాధారణ సంకల్పమే సంఘమునకు ప్రాతిపదిక. స్వాతంత్ర్యము మానవ సంకల్పము యొక్క నిత్య లక్షణము కనుక, సంకల్పమునకు వలెనే సమాజములకు కూడ స్వాతంత్ర్యమే ప్రధాన లక్షణమని అనవచ్చును. సమాజపు సాధారణ సంకల్పమునకు అనుగుణముగ వర్తించుట వల్లనే పౌరునకు పౌరత సిద్ధించును వ్యక్తి, సంఘముల సంకల్పముల మధ్య ఎట్టి భేదమును లేదు. కనుక సంఘము వలెనే వ్యక్తికూడ స్వతంత్రుడు. సంఘ సంకల్పములో వ్యక్తి సంకల్పము సంపూర్ణతను

పొందును. వ్యక్తి సంకల్పము సంఘ సంకల్పము యొక్క సూక్ష్మాకృతి. ఈ దృక్పథమునుండి చూచినచో పౌరతలో బాధ్యత, స్వతంత్రత అను విరుద్ధ లక్షణముల సమన్వయము సుసాధ్య మగును.

స్వాతంత్ర్యములో హక్కులును, బాధ్యతలును ముఖ్యమైన అంశములు. వీనిలో హక్కులు వ్యక్తులు అనుభవించునవి. వ్యక్తులపై సంఘమునకు గల హక్కులే వ్యక్తుల బాధ్యత లని వర్ణింపవచ్చును. కాని వాస్తవముగ హక్కులను, బాధ్యతలను ప్రత్యేకించుటకు వీలులేదు. ఇవి రెండును అత్యంత సన్నిహితమైన సంబంధము కలిగియున్నవి

ఈ విధమైన హక్కులను, బాధ్యతలను కలిగియుండిన సమాజము లందు తన్నిర్వహణమునకు ఒక కేంద్ర శక్తి అవసరము. ఇట్టి శక్తి లేకుండినచో హక్కులును, బాధ్యతలును విభిన్నములుగ ఉండి, సమాజము విచ్ఛిన్న మగును. కనుక, ఒక సమాజమునకు సాధారణ సంకల్పము, హక్కులు, బాధ్యతలు, కేంద్రశక్తి అనునవి ముఖ్య లక్షణము. లనుట స్పష్టము. ఇట్టి లక్షణములతో కూడిన సమాజములోని సభ్యత్వమునే 'పౌరత' అందురు.

పౌరుని సంకల్పమునకును, సమాజపు సాధారణ సంకల్పమునకును వ్యత్యాసము లేదు. పౌరత వ్యక్తిని, సంఘమును ఏకీకరించును. సాధారణ సంకల్పము యొక్క ప్రధాన లక్ష్యము సంఘశ్రేయస్సు. అది మానవుల వైయక్తిక అభిమతములతో సంబంధించినది కాదు. అందుచేతనే సంఘశ్రేయస్సునకును, సాధారణ సంకల్పమునకును సన్నిహిత సంబంధమున్నది. ఈ సంబంధము వలన పౌరతకు మరియొక అర్థము కూడ ఏర్పడుచున్నది. పౌరతయందు వివిధ వ్యక్తుల సంకల్పము లెట్లు ఐక్యమొందునో, అట్లే వైయక్తిక, సాంఘిక శ్రేయములు కూడ ఏకీభూత మగును. పౌరుడు సాధారణ సంకల్పమునకు పరమావధిగ గుర్తించి

సంఘశ్రేయమే తన శ్రేయ మని భావించుచుండును. సంఘశ్రేయస్సు కొరకే నిరంతరము పాటుపడుచు, తన హితమున కంటె సంఘ హిత మునే ప్రధాన తరముగ అతడు పరిగణించు చుండును. అవసరమగుచో సంఘహితముకొరకు తన హితమును త్యాగము చేయుటకు కూడ సిద్ధపడును.

సామాజిక జీవనములో సంస్థలు కూడ చాల ముఖ్యమైనవి. పౌరుని ఆశయము లనేకములు ; ఏ ఒక సంస్థయు వీటి నన్నిటిని సాధింపనేరదు. కనుక సంఘములో అనేక సంస్థలుండుట అవసరమైనది సంస్థలు ఆశయ ములను సాధించునవి. కావుననే పౌరులకు అవి ఆవశ్యకములైనవి అయినను, సంస్థా బాహుళ్యము వలన పౌరతకు ఒక క్రొత్త బాధ్యత కూడ ఏర్పడినది. సంస్థలన్నియు పౌరుని కవసరమైన వనుట నిజమే! కాని ప్రతి ఒక సంస్థయు ఏదో ఒక్క ఆశయమును మాత్రమే సాధించును. కాని, సమగ్ర జీవిత పరమావధిని సాధింపవలసిన బాధ్యతకాని అందుకు అవసరమగు సమర్థతకాని ప్రతి సంస్థకును ఉండవు సంస్థ లన్నియు ప్రయోజనకరము లనుటలో సందియము లేదు అయినను సంస్థల ఆశయములు ప్రత్యేకములును, సంకుచితము లును అని అంగీకరింపక తప్పదు. అందుచేత ఇవి యన్నియు చేరి పౌర జీవనమునే సంకుచిత మొనర్పవచ్చును. అంతేకాదు; సాధారణముగ ఆశ యము లన్నియు అంతకంటె ఉత్కృష్టమైన ఆశయములకు సోపానము వలె ఉపయోగపడును కాని కొన్ని సమయములలో మాత్రము ఆశయము లిట్లు అన్యోన్య సహాయకములుగ ఉండకుండుటయే కాక, పరస్పర భంజకములుగ కూడ ఏర్పడవచ్చును ఆశయములకును సంస్థలకును ఆ విధమైన వైరుధ్యమేర్పడ కుండునట్లు సమన్వయించి, వాటిని జీవిత పరమాశయమునకు సాధనములుగ నొనర్ప వలసిన ఒక క్రొత్త బాధ్యత కూడ పౌరునకు ఈ సంస్థా బాహుళ్యము వలన ఏర్పడుచున్నది.

పౌర జీవితములో ప్రభుత్వము ఒక ముఖ్యమైన అంశము. ప్రభుత్వమే లేకున్నచో, దేశములో శాంతి భద్రతలు కాని, న్యాయము కాని ఉండవు హక్కులను, బాధ్యతలను సక్రమముగ నిర్వహించు ఒక శక్తి లేనిచో పౌరత వినష్టమగును. కాని ప్రభుత్వము కూడా దేశములోని ఇతర సంస్థల వంటిదే అని కొందరి భావము. 1. ప్రభుత్వమునకును, ఇతర సంస్థలకును, 2 వ్యక్తికిని, వివిధ సంస్థలకును మధ్య సమరస సంబంధము ను నెలకొల్పుట పౌరుని ప్రధాన కర్తవ్యము. ఇతర సంస్థలన్నిటికంటె ప్రభుత్వము ప్రధానమైనది. ప్రభుత్వమునకు గల శక్తి, సామర్థ్యములు మరి ఏ ఇతర సంస్థకును లేవు. ప్రభుత్వములోని సభ్యత్వము నిర్బంధమైనది ఇతర సంస్థల సభ్యత్వ మట్టిది కాదు. రాజ్యములేకున్న సాంఘిక జీవనము అసాధ్య మని అనవచ్చును. ప్రతి ఒక వ్యక్తికిని రాజ్య మను సంస్థ అత్యంతావశ్యకము.

వ్యక్తులకు వలెనే సంస్థలకు కూడ రాజ్యము అత్యావశ్యకము. రాజ్యమునకు గల సమగ్రత కాని, తదితర లక్షణములు గాని మరి ఏ ఇతర సంస్థలకును లేవు. రాజ్యమేలేనిచో ప్రతి ఒక సంస్థయు ప్రత్యేకాధికారము వహించి, పౌరుని సంపూర్ణముగ లోబరచుకొనుటకు ప్రయత్నించును. పౌరత సంకుచితమై నశించిపోవును. వైయక్తిక, సాంఘిక జీవనములలో రాజ్యమునకు గల ప్రముఖ స్థానమును గుర్తించి, సంస్థలలోని సభ్యత్వమున కన్న రాజ్యపు సభ్యత్వమునే ప్రధానముగ నెంచుట పౌరుని కర్తవ్యము. ప్రభుత్వము సంస్థలన్నిటి కంటె గొప్పది: సమాజపు ఏకతను, సమగ్రతను వ్యక్తపరచునది. సంఘమునే పౌరుడు ముఖ్యముగ నెంచ దగును కాని, సంఘములోని అనేక సంస్థలను కాదు. మన పాఠశాలలపై కాని, కళాశాలలపై కాని ఊరిపై కాని, ఉద్యోగ మత సంస్థలపై కాని మనకు భక్తి, విశ్వాసము లుండుట యుక్తమే! కాని

సంఘము రాజ్యము లేకున్నచో ఈ ప్రత్యేక సంస్థలలో దేనికిని అవకాశమే ఉండదు కదా !

ఇది అంతయు నిజమే ! కాని, దీనివలన పౌరునకు క్రొత్త సమస్య లేర్పడు చున్నవి. రాజ్యమే ప్రధాన సంస్థ అయినచో పౌరుడు సర్వదా సంపూర్ణముగ రాజ్యమునకు లోబడి, ఉండవలయునా ! లేక రాజ్యముపై పౌరునకు ఏమైన హక్కులు కలవా ? రాజ్యము కొరకు పౌరుడు తన సర్వస్వమును త్యాగము చేయవలెనా ? పౌరుల అభ్యుదయమునకు రాజ్యము సాధనము కాదా ? ఈ ప్రశ్నలు పౌరనీతి యందును, రాజనీతి యందును చాల ముఖ్యమైనవి. ఈ ప్రశ్న లన్నియు రాజ్యమునకును పౌరునకును వైరుధ్యమును వ్యక్తము చేయుచున్నవి. వాస్తవమునకు ఈ వైరుధ్యము కేవలము కల్పితమైనది రాజ్యమునకును పౌరునకును సాధ్య, సాధక సంబంధమును కల్పించుటయే పొరపాటు రాజ్యమున్ను, పౌరుడున్ను అన్యోన్య ప్రవర్తకులు. ఉభయ జీవితములును ప్రత్యేకములు కావు ; ఒక్కటే !

రాజ్యమునకు, పౌరునకు గల సంబంధమునే కాక, పౌరునకు, సంఘమునకు గల సంబంధమును కూడ ముఖ్యముగ గమనింప వలెను. సాంఘిక భావమునకును, వైయక్తిక భావమునకును సంఘర్షణ ఏర్పడ వచ్చును అట్టి సందర్భమున పౌరుని కర్తవ్యమేమి ? తన భావముల వలెనే ప్రధానముగ నెంచి వ్యక్తి సంఘమును తిరస్కరింప వచ్చునా ? ఈ సమస్య చారిత్రకమైనది. సోక్రటీస్ వంటి మహాపురుషులు ఈ ప్రశ్నకు జవాబు చెప్ప ప్రయత్నించిరి సోక్రటీస్ జీవితము నుండి పౌరునకు సంఘముతోను, రాజ్యముతోను ఉండనగు సంబంధము చక్కగ తెలియనగును సోక్రటీస్ సూచించినట్లు సాంఘిక భావముల కన్న పౌరుని భావములు ఉన్నతములై, సాంఘిక ధర్మములు పౌరునకు ప్రతి-

బంధకముగ ఉండినచో-వానిని ప్రతిఘటించుటయే పౌరుని కర్తవ్యము. కాని, తాను ఆదర్శ జీవి అయినను రాజ్యధర్మములను మాత్రము పౌరుడు ఉల్లంఘింపరాదని కూడ సోక్రటీస్ జీవితము నుండియే తెలియవచ్చుచున్నది. స్వాభిమానముతో కాని, కళాదృష్టితో కాని, స్వలాభదృష్టితో కాని పౌరుడు ప్రభుత్వ శాసనమున నెన్నటికిని తిరస్కరింపరాదు. కాని, భగవానునిచేత గాని, అంతరాత్మచేతగాని ప్రేరితుడై వానిని ఉల్లంఘించినను, రాజ్యము విధించు శిక్షకు కూడ అట్టి పౌరుడు సంసిద్ధుడుగ ఉండవలెను

అత్యంత ప్రధానమైన మరియొక సమస్య ఇప్పుడు ఉత్పన్నమగుచున్నది. పౌరునకు తిరుగుబాటు చేయు అధికారమున్నదా ? తన సంఘమును గాని, దేశమును గాని ధిక్కరించుటకు అసలు ఎవ్వరికైన హక్కున్నదా ? నిజమునకు - అట్టి హక్కు కేవలము హాస్యాస్పదమైనది. అందుచే-అట్టి 'విప్లవాధికారము' పౌరునకు ఉండుటకు వీలులేదు. ఒకవేళ అట్టి హక్కు ఉన్న దనినచో- దానిని అమలు జరుపు వారెవరు ? సంఘమును, రాజ్యమును కాదని, ఏ హక్కుగాని, నిలువ జాలదు. హక్కులెల్లప్పుడును సంఘమునకు అనుబద్ధములుగానే ఉండును. ఆత్మ స్వాతంత్ర్యముగల ఒక వ్యక్తి ఉత్తమ సంఘవ్యవస్థను కోరుచు, వర్తమాన దుష్ట సంఘవ్యవస్థ పట్ల నిరసన తెలుపుటకై సంఘమును ధిక్కరించి వేయుట అనాగరక మగు పద్ధతి.

పౌరధర్మముల నాచరించవలె నన్నచో అందుకు తగిన శిక్షణ అత్యంతావశ్యకము. ఈ శిక్షణము కేవలము పౌర ధర్మమును, పౌరనీతిని అభ్యసించుటతో ముగియదు. పౌరనీతిని కార్యతః ప్రదర్శించుట మిక్కిలి కఠినమైన పని. పౌరులయందు బుద్ధి బలముతోపాటు నైతికశక్తి, జాగరూకత కూడ లేకుండినచో పౌరత్వపు ఆదర్శములు సిద్ధింపవు. తన హితము కన్న సాంఘిక హితము నెక్కువగ నెంచుటే పౌరధర్మము.

సాంఘిక శ్రేయస్సు మీదనే వైయక్తిక శ్రేయస్సు కూడ ఆధారపడి ఉండుటయే దీనికి కారణము. పౌరశిక్షణము నందు సత్యాసత్యములను, మంచిచెడ్డలను, మిథ్యా, యథార్థతలను, హిత, ఆకర్షక విషయములను విడివిడిగ గుర్తింప గల్గినట్లు చేయుట ముఖ్యవిషయము.

పౌరతయందు హక్కులును, బాధ్యతలును మిక్కిలి ప్రధాన మైనవి పౌరుడు హక్కులు లభించినంతనే తృప్తినొంది సంఘజీవన మును, హితమును మరచినచో పౌరత నశించును పౌరత ప్రజల కృషి పైని, కార్యదీక్షపైని ఆధారపడి యున్నది. సామాజిక జీవనము నుండి పౌరత ఏర్పడును. అందే అభివృద్ధి పొందును. అందుచే పౌరతకును సామాజిక జీవనమునకును అత్యంత సన్నిహితమైన సంబంధము కలదు. సామాజిక జీవితముతోగాని, ఇరుగు పొరుగుల విషయముతో గాని సంబంధము లేకుండుట సత్పురుషుల లక్షణ మని సాధారణముగ భావింతురు. కాని, అది సత్పౌరునిలక్షణము మాత్రము కాదు. ఆరిస్టాటిల్ అనినట్లు—("సత్పురుషునకును, సత్పౌరునకును వ్యత్యాసము లేదు. సంఘ వ్యవహారములందు పాల్గొనకుండు వ్యక్తి నిరపాయకరమైన వాడు కాదు. అతడు మిక్కిలి అప్రయోజకుడు మాత్రమే అని మా అభిప్రాయము.")

## పౌరత్వపు పుట్టుపూర్వోత్తరములు :

పౌరత్వపు చరిత్ర కూడ గ్రీసుదేశముతో ఆరంభమగును సాంఘిక జీవనము, సామాజిక సంకల్పము, వివేకము, గ్రీసుదేశములో ఉద్భవింపగలిగి నవేకాని, ప్రాచ్య దేశములందు ఉద్భవింపలేకపోయినవి. దీనికి కారణము ప్రాచ్యదేశముల ఆముష్మిక దృష్టియే అనియు, ముఖ్యముగ హిందూదేశ మందు సంఘ మొకటిగ ఉండక, అనేక వర్ణములుగ విభక్తమై ఉండుట అనియు, పలువురి అభిప్రాయము. గ్రీకునగర రాజ్యములు చిన్నవి కనుక ప్రజలు ఒకరితోఒకరు అన్యోన్యముగ ప్రవర్తించుచు సాధారణ సంకల్పము

నకును, సమాజమునకును, హక్కు బాధ్యతలకును రూపకల్పన చేసిరి కాని ఆర్యులు హిందూ దేశములో అడుగు పెట్టగానే ఇచ్చటి అగాధమైన ప్రకృతి సౌందర్యమున్ను, మహత్త్వమున్ను వారిని ఆకర్షించినవి. అందుచే వారి దృష్టి అంతయు ఈ అపూర్వ లక్షణములపై ప్రసరించినదే కాని, సాంఘిక, సామాజిక విషయముల వైపు ప్రసరింప లేదు.

గ్రీసుదేశపు నగర రాజ్యములకును, ప్రజలకును అనేక విధము లైన సంబంధ ముండినది. నాటి గ్రీసుదేశపు పరిస్థితులకును, ఇప్పటి పరిస్థితులకును బ్రహ్మాండ వ్యత్యాసమున్నది నాటి నాగరకత కంతకును గ్రీకు పౌరులకుగల విరామమే ముఖ్యమైన ఆధారము. వారు సమయము నంతటిని తమ వృత్తులలోనే గడపక, విరామ సమయములలో రాజ్య వ్యవహారములలో కూడ పాల్గొనుచుండిరి సమష్టి జీవితము వలన పౌరు లకు అన్యోన్యత, సమత్వము అను భావములు అలవడినవి. 'రాజ్యము సామాజిక హితము కొరకే!' అను భావము కూడ ఏర్పడినది

గ్రీసు దేశము నందు పౌరత కేవలము సాంఘికము మాత్రమేకాక, రాజకీయము కూడ అయియుండెను. గ్రీకు పౌరతయందు హక్కులును బాధ్యతలును సామాజికములు మాత్రమే కాదు. రాజకీయములైన హక్కు లును బాధ్యతలును కూడ చాల ముఖ్యముగ పరిగణింప బడుచుండెను.

మధ్యయుగములందు పరిస్థితులు సంపూర్ణముగ తారుమారైనవి క్రైస్తవ సమాజమునకు క్రైస్తవ మత గురువున్ను, చక్రవర్తియు కూడ అధికారులైరి. రాజ్యమనునది వ్యక్తికి ఆధారముగగాని, అతని సంకల్ప మునకు కేంద్రముగ గాని ఉండెడిది కాదు. మధ్యయుగపు సమాజములో భూస్వాముల ప్రభావము ఎక్కువగా ఉండేది. దేశములో ప్రభుత్వాధి కారము ఏకత్ర కేంద్రీకృతమై యుండక వివిధ భూస్వాముల మధ్య విభ క్తమై యుండెను. అంతేకాక పలువురు అనేక దేశముల యందు భూమి

కలిగియుండి, ఆ యా దేశాల రాజుల కందరకును గూడ విధేయులై ఉండుట సర్వసామాన్యమైన అంశముగ నుండెను. నాటి రాజులు కూడ గొప్ప భూస్వాములే! అట్టి పరిస్థితులలో ఆధునిక రాజకీయ సిద్ధాంతములు గాని, జాతీయ భావము గాని, రూపొందుటకు సాధ్యము కాకుండెను మధ్యయుగములో పౌరతకుగాని, హక్కు-బాధ్యతలకు గాని అవకాశము లేదు. ప్రజలు భూస్వాములకే విధేయులై యుండి, రాజ్యమును గాని, రాజ్యాధికారమునుగాని, గౌరవింపకుండిరి భూస్వాముల ప్రాబల్యము వలన రాజ్యమున్ను, రాజ్యాధికారమున్ను పూర్తిగా అప్రధానములై పోయినవి.

సామ్రాజ్యమునకును, క్రైస్తవ మత సంఘమునకును ఏర్పడిన ఎడతెగని పోరాటము వలన పౌరతకు కూడ ఎట్టి ఆస్కారమున్ను లేకుండ పోయినది. మధ్యయుగములందు ఏకత లేకుండుటకు భూస్వాముల ప్రాబల్యము ప్రధాన కారణము ఆ నాటి తత్త్వజ్ఞులు ఆ పరిస్థితుల నుండి యూరపును తప్పింప వలెనన్నచో సార్వభౌముని పరిపాలన మొక్కటే శరణ్యమని భావించిరి.

మధ్య యుగములోని నగరములు మాత్రము భూస్వాముల అధికారము క్రింద లేక స్వతంత్రములుగ ఉండి సామాజిక సంప్రదాయములను సముద్ధరించ బూనినవి. కాని, క్రమముగ ఇవి కూడ వాటి సాధారణ పరిపాలనా పద్ధతుల ప్రభావమునకు లోబడి పోవలసి వచ్చెను. ఆ మార్పును ఆ నాటి వృత్తిసంఘములు మరింత వేగిరించినవి ప్రతి కార్మికుడును, ప్రతి వ్యాపారస్థుడును ఈ వృత్తిసంఘముల, నిబంధనలకు లోబడి ఉండుట తప్పనిసరి అయినది. నగర పరిపాలనము కూడా చివరకు వృత్తి సంఘముల ప్రాబల్యమునకు దాసోహ మన జొచ్చెను. నగరములలోని

ప్రజల జీవనమున్ను, ఇతరత్ర భూస్వాముల పాలనలో ఉండిన ప్రజల జీవనమున్ను ఈ విధముగా చివరకు ఒకటిగానే పరిణమించినవి

అర్వాచీనయుగపు అపూర్వ పరివర్తనలగు 'రెఫర్మేషన్' అనబడు మత సంస్కరణోద్యమున్ను, 'రెనైజాన్స్' అనబడు సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమున్ను పౌరుని వ్యక్తిత్వమును మరింత బలపరచినవి. పౌరత్వమునకు వ్యక్తిత్వము ముఖ్యమైన ఆధారము. ఈ అపూర్వ పరివర్తనముల అనంతర మేర్పడిన రాజకీయ, సాంఘికోద్యమములు కూడ ఇదే రీతిని పౌరవ్యక్తిత్వమును బలపరచి, పౌరతకు పుష్టి చేకూర్చినవి 1789 వ సంవత్సరమున ఫ్రాన్స్‌లో విజృంభించిన విప్లవము సర్వమానవ సమానత్వమును చాటి, తత్పూర్వ పారిశ్రామిక విప్లవమునుండి ఉద్భవించిన ఉత్సాహశక్తులకు అసాధారణమైన ఒక నూతన చైతన్యమును ప్రసాదించి, సర్వతోముఖమైన మానవ స్వాతంత్ర్యమును, ప్రజాప్రభుత్వమును, తద్వారా ఉత్తమ పౌరతను సిద్ధింపజేసినది. అర్వాచీనయుగారంభములో అంతవరకు మరుగుపడి యుండిన విజ్ఞానము పునర్వికాస మొందిన విధముగానే మధ్యయుగములందు అస్తమించి యుండిన పౌరత కూడ తిరిగి అవతరించింది అర్వాచీనయుగ లక్షణములలో పౌరత్వ పునరుజ్జీవనమును ముఖ్యముగ పేర్కొన వలెను.

కాని, పూర్వయుగములకును, నేటికిని ఎంతేని వ్యత్యాసము కలదు. పారిశ్రామిక విప్లవమువలన నేటి సంఘమున కొక నూతనమైన ఆకృతి ఏర్పడినది. నేటి సాంఘిక వాతావరణ మపూర్వమైనది. మానవుల సంబంధములు పూర్వమువలె ఈ నాడు సరళములు కావు. సంఘములో నూతన ఆశయములతో అనేక సమాజములును, సంస్థలును ఏర్పడి, పౌరత్వము ననేక రీతుల విక్షిప్తము కావించు చున్నవి. పౌరతకు ఆధారమైన సమగ్రదృష్టి నేడు దుర్లభ మగుచున్నది.

ఆధునికయుగపు, ఆర్థిక, సాంఘిక పరిస్థితుల వలన ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము ఉద్భవించినవి. ఇవి పౌరతకు పూర్తిగా విరుద్ధములు. పౌరత దృష్ట్యా రాజ్యము వ్యక్తి అభ్యుదయమునకు సాధనము. కాని, ఫాసిజమ్, తదితర నిరంకుశత్వ సిద్ధాంతములందు వ్యక్తియే రాజ్యపు మనుగడకును, అభ్యుదయమునకును సాధనము. ఈ విధమైన సిద్ధాంతములు ముఖ్యముగ ఇటలీ, జర్మనీ దేశములందు విశేషముగ ప్రబలినవి. ద్వితీయ ప్రపంచమహా సంగ్రామములో ఈ రాజ్యములే విజయ మొంది ఉండినచో పౌరతకు గొప్ప ప్రమాదము సంభవించి ఉండేది.

ఇప్పుడైనను పౌరత నిరపాయముగ సుస్థాపితమై ఉన్నదను కొనుటకు వీలులేదు. పౌరులు అప్రమత్తులుగ ఉండక పోయినచో ప్రజా నాయకులే పౌరుల స్వాతంత్ర్యము నపహరించి, నిరంకుశ పాలకులుగ ఏర్పడుట ఎప్పటికైనను తప్పదు. పౌరుల అజాగరూకతయు, తత్పర్యవసానముగ నాయకుల నిరంకుశత్వమును చరిత్రలో సర్వసాధారణము లగు విషయములే !

(పౌర జీవనమునకు వ్యక్తిత్వము మూలాధారము. వ్యక్తియొక్క గుణాతిశయమే పౌరత్వపు విధానమునకు ముఖ్యకారణము.) గ్రీకు తత్త్వజ్ఞుడైన అరిస్టాటిల్ సూచించినట్లు సత్పౌరునకును, సత్పురుషునకును వ్యత్యాసము లేదు. వ్యక్తిత్వము ఆధునిక యుగలక్షణములలో ముఖ్యమైనది. "వ్యక్తిత్వము సామాన్యముగ ప్రత్యేకతను, పౌరత సంఘజీవనమును సూచించును గనుక, వ్యక్తిత్వము అభివృద్ధి నందినకొలది నిజమునకు పౌరత్వమే క్షీణింపవలయునుకదా !"– అని ఈ సందర్భమున కొందరు ఒక ఆశంక చేయవచ్చును. కాని, వాస్తవమునకు ఈ రెండింటికిని వైషమ్యము లేదు. సంఘజీవనము లేకున్న వ్యక్తిత్వము కాని, వ్యక్తిత్వము లేకున్న సంఘజీవనము కాని లేవు. వ్యక్తిత్వమునే ప్రధానముగ

నెంచి, సంఘజీవనమునకును, వ్యక్తిత్వమునకును వైషమ్యమునకును కల్పించుట ఇటీవలి వారగు హెర్బర్ట్ స్పెన్సర్ ప్రభృతుల ముఖ్యోద్దేశము కాని, పౌరనీతియందిట్టి కల్పనకు నిజమునకు స్థానములేదు వ్యక్తిత్వము విశిష్టతను సూచించును గాని, కేవలము ప్రత్యేకతను సూచించదు. సామాజిక జీవనమునకును, సంస్కృతికిని వ్యక్తిత్వము కేంద్రము వంటిది. అంతేకాని, అది సామరస్య భంజకము కాదు. కనుక-పౌరతమీదనే మానవుల ఉన్నతిగాని, విశిష్టత గాని ఆధారపడి ఉన్నవి. సామాజిక జీవనములోని మహత్త్వమునకును, అందలి లోపములకును కూడ పౌరులకు సరిసమానమైన బాధ్యత గలదు.

**పౌరతకు ప్రధానార్హతలు :** నేటి రాజ్యములు జాతీయ రాజ్యములు కనుక, నేటి పౌరత ఒక రాజ్యమునకును, ఒక జాతికిని నియమితమై ఉండును. పౌరత కోరువ్యక్తి ఆ దేశమున జన్మించి యుండుటగాని, ఆ రాజ్యమునకు లోబడి యుండుట గాని, లేదా ఆ రాజ్య పౌరుల సంతతికి చేరియుండుట గాని అవసరము సాధారణముగ నేటి రాజ్యములలో జన్మయే పౌరతకు ప్రధానార్హతగ పరిగణింప బడుచున్నది

మన దేశములో పౌరత రాజ్యాంగముపైని, శాసనసభపైని ఆధారపడి యున్నది మన రాజ్యాంగపు అయిదవ నిబంధనము ప్రకారము భారత దేశమునందే స్థిర నివాసులైన వారును, భారతదేశమున పుట్టిన వారును, తల్లిదండ్రులలో ఎవరో ఒకరు భారతదేశమున పుట్టియుండినను అట్టివారి సంతతియును, ప్రస్తుత రాజ్యాంగము అమలులోనికి రాకపూర్వము అయిదు సంవత్సరములుగ భారత దేశమునందే నివసించుచుండినను భారతదేశములోనే జన్మించి యుండిన వారును, లేదా వారి తల్లి దండ్రులలో గాని, తాత ముత్తవలలో గాని ఎవరైనను భారతదేశ

మున జన్మించి యుండినను కూడ 8 వ నిబంధనము ప్రకారము భారత పౌరులుగనే పరిగణింప బడుదురు. కాని, ఇందుకు వారు తాముండు దేశములోని భారత ప్రతినిధుల ద్వారా పౌరులుగ తమ పేరులను నమోదు చేయించుకొన వలసి యుండును.

మన దేశీయు లితర దేశముల పౌరత నంగీకరించినచో మన దేశపు పౌరతను కోల్పోవుదురు.



# సంఘంలో మార్పు: శాస్త్రీయ దృక్పథము

## డాక్టర్ సి. లక్ష్మన్న

నవభారత సమాజము పరిణామానికి మారు పేరుగా వుంటున్నది. సంఘములో అనేక మార్పులు వస్తున్నవి. స్వాతంత్ర్యము సాధించడముతో పరిపాలనా వ్యవస్థలో మార్పువచ్చింది. ప్రజాస్వామ్యబద్ధమైన పరిపాలనా యంత్రాగము నెలకొనింది. భారత రాజ్యాంగము విభిన్నమైన హక్కులను గుర్తించింది. సామాన్య మానవుని పాలన యేర్పడాలని ఆకాంక్షించింది. రాజకీయ స్వాతంత్ర్యము ఆర్థిక విధానములో మార్పును సూచించింది. సమాజ సామ్యవాద సిద్ధాంతాల ప్రాతిపదికగ నూతన ఆర్థిక వ్యవస్థను సాధించాలని భారతప్రభుత్వము, ప్రజలు-ఆసక్తి, ఉత్సుకత చూపుతున్నారు. ఈవిధంగ మార్పులు చెందుతున్న ఆర్థిక, రాజకీయ వ్యవస్థలు నూతన సాంఘిక వ్యవస్థతోనే సాధ్యమవుతాయి అందే ఆనాదిగా దేశంలో నెలకొన్న సాంఘిక వ్యవస్థమార్పుకు అనుకూలంగాలేదు కాలంతో

పాటు, సమాజము కొన్ని మూఢనమ్మకాలను, సాంఘిక నియమాలను వుత్ప న్నముచేసి, వాటిని పాతుకొని పోయేలా చేసింది. ఈమూఢనమ్మకాలు, అహేతుక వాదాలు పరిణామానికి అడ్డంకులుగ వుంటున్నాయి.

నేటి పరిస్థితిని సంధియుగంగా పేర్కొనవచ్చును. ఈయుగసంధిలో పాత విలువలకు స్థానము, హోదా, ప్రతిపత్తి, స్థిరత్వము లేకుండపోతు న్నది. వాటికి హేతుబద్ధత సన్నగిల్లి పోతున్నది. సనాతన సంఘానికి, సనాతన కట్టుబాట్లకు గీటురాళ్ళుగా మాత్రమే మిగిలిపోతున్నాయి. సాంఘిక ప్రయోజనాలకు, సాంఘిక లక్ష్యాలకు, యీవిలువలకు యెలాంటి సంబం ధములేకుండ పోతున్నది. గట్టిగ చెప్పాలంటే, అవి కేవలము శిధిలావస్థలో వున్న సాంఘిక వ్యవస్థకు నిష్ప్రయోజనమైన పునాదులగ మాత్రమే వ్యవ హరిస్తున్నాయి. కాని పునాదులన్ని కదిలిపోయి, యిప్పుడో అప్పుడో కూలి పోతుంది. అనే భావాన్ని మరి మరి గుర్తుచేస్తున్నాయి. అయితే దుర దృష్టమేమిటంటే, అటువంటి (సంధియుగములో నూతన విలువలకు ఒక ప్రస్ఫుటమైన రూపురేఖ యేర్పడి వుండలేదు. మసక మసకగ నూతన వ్యవస్థ యొక్క ఆకృతి కనిపిస్తూ వుంటున్నది.) అంటే నూతన విలువలు, సాంఘిక ప్రయోజకారి అయివుండికూడా, సామాజిక వ్యక్తుల సంపూర్ణ ఆమోదాన్ని పొందలేదు. వాటిని గూర్చిన సంశయము, అనుమానము కొట్ట వచ్చినట్లు కనీసము కొన్ని వర్గాలలోనైన కనిపిస్తున్నది. అందుచేత, నూతన విలువలను స్వంతము చేసుకొనడములో, సామాజీకరణ యంత్రాం గంగ రూపొందడములో కొంత సంకు, తడబాటు, బిడియము అగుపిస్తుంది. ఇది కాకుండ యింకో అంశముకూడ తలెత్తుతుంది. ఒకసారి పాతుకు పోయిన, స్థిరపడిపోయిన విలువలను త్రోసిపుచ్చినప్పుడు వాటి వునికిని ప్రశ్నించినప్పుడు, క్రొత్తరూపు దాల్చుకొంటున్న నూతన విలువల పట్ల కూడ కొంత సంశయాత్మక దృక్పథము చెప్పుకుంటానే ప్రజానీకములో

ప్రస్ఫుటమవుతున్నది. అందుచేత సమాజము కొంత గందరగోళంగ వుంటున్నది. చలనము సంఘములో ఒక విధమైన అస్థిరత్వము (Unrest)ను కలుగజేసి, ప్రజలలో నిస్పృహ, చేతగానితనము (Helplessness) వగైరాలను కలిగిస్తున్నది. దాదాపుగ నేటి భారత సమాజము అటువంటి స్థితిలోనేవుంది. గ్రామీణ ప్రజానీకము నగరవాసుల వైపు దృష్టిని నిలిపి వాళ్ళను అనుకరిస్తున్నారు. నగరవాసులు పాశ్చాత్య నాగరికతా లక్ష్యాలపై లక్షణాల వైపు మొగ్గచూపుతున్నారు. అంటే నేడు ఒకవిధమైన భయాత్మక సందిగ్ధ స్థితిలో సంఘము వుంటున్నది విచక్షణ, హేతుకత పూర్తిగా సన్నగిల్లిపోయింది. పాశ్చాత్య సమాజములో దృఢత్వముకలిగి, సాంఘికాభివృద్ధికి తోడ్పడుతున్న విలువలను మనము పాటించటము మనవిధి. పాశ్చాత్య సమాజము శాస్త్రీయ సాంకేతిక రంగాలలో 'అనర్గళమైన కృషి సాధించింది శాస్త్రీయ, సాంకేతిక అంశాల ఆధారంగా కొన్ని స్థిరమైన విలువలను పెంపొందించింది. వాటిని మనము అనుసరించడములో కాని, మనవిగా చేసుకోవడములోగాని యెటువంటి తప్పులేదు. పైగా వాటిని. మన సంస్కృతిలోనికి, నాగరికతలోనికి, మన సాంకేతికాభివృద్ధిలోనికి అంగాలుగా చేసుకోవడము అతిముఖ్యము. పోతే (పాశ్చాత్య సమాజములో రేకెత్తిన అసంతృప్తి సూచకమైన పై పై మెరుగులను మాత్రమే అనుకరిస్తూ,అంతర్లీనమై యున్న వుత్తమ విలువలను (Intrinsic Values) ను మరచిపోవడముతోనే తప్పటడుగు వేస్తున్నాము.) అంటే సాంఘిక మార్పులపట్ల సహేతుకమైన శాస్త్రీయ దృక్పథము నేడు చాల ముఖ్యమని నొక్కిచెప్పవచ్చు. సంఘంలో కలుగుతున్న ప్రతి మార్పును తులనాత్మకంగ పరిశీలించి, శాస్త్రోక్తంగ సమాజ ప్రయోగకారి అయినప్పుడే, యే మార్పునైన ఆమోదించి, ప్రోత్సహించవలసివుంది. పాతకొత్త విలువల బాగోగులు క్షుణ్ణంగ అవగాహన చేసుకో

వలసివుంది. అంటే సమాజాన్ని పరిశోధనాత్మక దృష్టితో నిరంతరము సమీక్షించి, విశ్లేషించి, విచక్షణా జ్ఞానముతో మెలుగవలసివుంది. అప్పుడే నవసమాజానికి గట్టి పునాదులు వేయగలుగుతాము. ప్రజానీకములో సుఖ శాంతులకు స్థానము యేర్పాటు చేయగలుగుతాము.

అటువంటి దృక్పథము పెంపొందాలంటే, సామాజిక పరివర్తనము యొక్క రూపురేఖలు, గతి, వేగము మొదలైన అంశాలగూర్చి సూక్ష్మంగ తెలుసుకోవడముఅవసరము. స్థూలంగ చెప్పాలంటే సంఘములో మార్పు, సామాజిక పరివర్తనము రెండు రకాలు (1) సామాజిక వృద్ధిక్రమము. (2) యోజనాత్మకమైన ప్రణాళికాబద్ధమైన సాంఘిక పరివర్తనము. ఇంతో కొంతో సంఘము నిరంతరముగ మార్పు చెందుతూనే వుంటుంది. పోతే కొన్ని సార్లు (చాలామారులే కావచ్చు) యీ మార్పు కంటికందక, మంద కొడిగ వుండి, అచలనంగా వుందా అనే అపోహకు, సంశయానికి దారి తీస్తుంది. కాని సూక్ష్మంగ పరిశీలించి నట్లైతే, మార్పును గమనించడము అంత కష్టముకాదు. సమాజములో అంతర్లీనమై కొన్ని శక్తులు నిరంతరంగా పనిచేస్తుంటాయి. జనన మరణాల వల్ల, స్థానచలనము వలన, నైసర్గిక మార్పుల వలన, సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థలలో కొద్దికొద్ది మార్పుల వలన సంపూర్ణ సమాజము కొంతకు కొంత మార్పు చెందుతూనే వుంటుంది. ఈ అంశంలో గూడ సంఘములో ప్రజానీకము యొక్క, కార్యకలాపాల యొక్కయు, దృక్పథము యొక్కయు ప్రభావము కొంత వరకు ఉంటుంది. గాని యీ పరివర్తనము చాలవరకు ప్రజానీకము యొక్క ప్రమేయము లేకుండానే జరిగిపోతూ వుంటుంది.

రెండో కోవకు చెందిన సాంఘిక పరివర్తనమే ప్రస్తుతము మనకు ముఖ్యము. అంటే సమాజములో సహజగతిలో వున్న పరిణామముతో సంతృప్తి పొందలేక నూతన సమాజ నిర్మాణానికి అంచనాలు, పథకాలు

వేసి, సాంఘిక పరివర్తనానికి కృషి ప్రయాసలు చేస్తుండంలోనే మనకు చాల సంబంధము వుంటున్నది. ఈ ప్రణాళికా రచనలో, మార్పుల నుద్దేశించడములో శాస్త్రీయ దృక్పథము ప్రస్ఫుటము కావాలి. ఈ పరిణామాలను సాధించడంలో సమాజములో నూతన శాస్త్రీయ దృక్పథాన్ని మలిచి, దానిని ప్రోత్సహించ వలసి వుంది. ఈ కోవకు చెందిన సాంఘిక పరివర్తనము అర్థవంతము, ప్రయోజనాత్మకము కావాలంటే ప్రజానీకము యావత్తుకు దానితో సంబంధ బాంధవ్యాలు నెలకొల్పు కోవాలి. ఈ నూతన సమాజ నిర్మాణములో తాము భాగస్వాములు అనే భావము వ్యక్తంగావాలి. ప్రజలలో వివేచనా జ్ఞానము, హేతుకత్వము, సమీక్షక దృష్టి, శాస్త్రీయ దృక్పథము కలిగిననాడే ఆ భావము సాధ్యమవుతుంది. మూఢనమ్మకాలు, పిడికట్టు వాదాలు వున్నంత కాలము యిలాంటి సంపూర్ణ ఆమోదముతో గూడిన కలుపుగోలు తనము, భాగస్వామ్యత్వము నెలకొనదు.

ఒక విధంగా చెప్పాలంటే సామాజిక ప్రగతిలో సాంఘిక అభ్యుదయములో, మానవ పరిణామములో నేటి 'మానవ' సమాజము శాస్త్రీయ యుగంగ పేర్కొన వచ్చును. అనేక అంగాలలో, రంగాలలో యీ శాస్త్రీయత పాతుకునిపోతూ వున్నది. ఇంకా యేమైనా వుంటే, యీ శాస్త్రీయత, శాస్త్రీయవాదము ఒక విధమైన నూతన మూఢనమ్మకాలకు దారి తీసేటంతగా సమాజములో శాస్త్రీయ సంచలనము కలిగివుంది. అగస్టుకోమ్టు (Auguste comte) మహాశయుడు అనాదినుండి నేటి వరకు సాంఘికాభివృద్ధిని, మానవ ప్రమాణాన్ని మూడు దశలుగా విభజిస్తాడు. (1) ధార్మిక (మతసంబంధమైన) సమాజము (Theological) (2) తార్కిక (అతిభౌతిక) (Meta physical) సమాజము (3) శాస్త్రీయ (నిర్మాణాత్మక) (Positive) సమాజము. వీటికి అనుగుణంగా వరుసగా 1. సైనిక (Military) 2. చట్టమూలమైన (Legalistic)

3. పారిశ్రామిక (Industrial) సమాజాలూ యేర్పడుతాయి అంటే అధునాతన సమాజము పారిశ్రామిక యుగంగా రూపొందిందన్న మాట. ప్రపంచము మొత్తము పర్యావలోకన చేసినప్పుడు, యీ విషయము సత్య సహితమే అన్నదాంట్లో యెలాంటి సందేహము లేదు. ప్రపంచములో పరిణతి చెందిన దేశాలు, పరిణతి చెందుతున్న దేశాలు, అన్ని కూడ పారిశ్రామిక పురోభివృద్ధికి నిరంతరంగ కృషి చేస్తున్నాయి. (భారీ పరిశ్రమలు విస్తృతంగ నెలకొన్ననాడు, ప్రజలలో ధృఢమైన శాస్త్రీయ దృకృథము యేర్పడితేనే, పారిశ్రామిక వ్యవస్థ యొక్క సమస్యలను, సాంకేతిక పరిజ్ఞానాన్ని, యంత్రాంగముపై తగిన చాకచక్యము, అధికారము, దక్షత యేర్పడగలవు.

అంటే పారిశ్రామికీ కరణము అధునీకరణానికి గీటురాయి. ఈ పారిశ్రామికీకరణము చిరకాలంగగృహంగణానికి పరిమితులైన స్త్రీవర్గాన్ని బంధ విముక్తులను చేయడములాంటి చర్యలకు దారితీస్తుంది ఈ మారుతున్న విలువలను గుర్తించకుండ, సనాతనధర్మానికి కట్టుబడి స్త్రీ గృహిణి మాత్రమే అని యెంత ఆరాటపడినా ప్రయోజన ముండదు. అలాగే సమానత్వము, స్వాతంత్రము, సహోదరత్వము లాంటి నూతన విలువలకు యెక్కడలేని బలము ప్రాప్తమవుచున్నది. వ్యక్తి వ్యక్తిపై, వ్యక్తి వర్గముపై వర్గము వర్గముపై పెత్తనము చలాయిస్తూ, దోపిడికి దారితీసే విధానానికి స్వస్తి చెప్పవలసి వస్తూన్నది. అంటే సమాజవాద ఛాయలు నలుమూలల ప్రాకుతున్నాయి. ఇది నూతన చరిత్రగతికి ప్రస్ఫుట తార్కాణము. ఈ చరిత్రగతిని శాస్త్రీయదృకృథముతో అర్థము చేసికొని, ఆగతివేగాన్ని పెంచడానికి సహాయ పడాలేకాని, మొండిగ అడ్డుకోడానికి ప్రయత్నిస్తే, కదులుతున్న రథచక్రాల క్రింద పడి నలిగి నశించి పోవలసి వస్తుంది.

సంఘములో మార్పు, శాస్త్రీయ దృక్పథము అన్న అంశాన్ని రెండు కోణాలనుండి చూడవచ్చును. 1) సంఘములో వస్తున్న మార్పుల పట్ల శాస్త్రీయ దృక్పథము అలవర్చుకొని హేతుబద్ధంగ, వివేచనాత్మకంగా పరిశీలించి, నూతన విలువలను సక్రమ మార్గములో సాధించడము. అంటే శాస్త్రీయ, సాంకేతిక అభివృద్ధివలన వస్తున్న ప్రతి పరిణామము యెంత వరకు సాంఘిక ప్రయోజనాలకు దోహదకారిగ వుంది. యెంతవరకు సుఖ శాంతులకు నిలయమైన నూతన సమాజ నిర్మాణానికి అవసరము, ఉపయోగము అనేదాన్ని క్లిష్టంగ, సూక్ష్మంగ పరిశీలించ గలిగిన ఒరవడి, దక్షత సమాజములో అభివృద్ధి కావడానికి తగిన వాతావరణాన్ని సృష్టించ కలగాలి ప్రతి వ్యక్తి స్వశక్తిపై, స్వంత ఆలోచనపై సామాజిక ప్రక్రియలను అవగాహన చేసుకొని ఆచరించ కలిగిన స్థోమత కలుగజేసే ప్రయత్నాలు సంఘములో జరగాలి మూఢ నమ్మకాలను అట్టి పెట్టుకొనడము వలన సాంఘికంగ, వ్యక్తిపరంగ యెలాంటి లోటుపాట్లకు, అనర్థాలకు దారితీస్తుందో స్వతహాగా విమర్శించుకొనే శక్తి ప్రజానీకములో పెరగాలి. ఆ నాడు శాస్త్రీయ దృక్పథము దానంతటదే ప్రజలలో యేర్పడుతుంది. 2) సంఘములో రచింపబడిన, తీసుకురాబడిన ప్రతి మార్పు సహేతుకము, శాస్త్రోక్తము కావాలి అంటే ప్రణాళిక రచనలో, అభివృద్ధి పథకాలలో ఈ శాస్త్రీయత స్పష్టంగ కానరావాలి. ఇది జరగాలంటే పాలకవర్గము, మేధావి వర్గము అప్రమత్తము, సామర్థ్యముకలిగి, అటువంటి పరిణామాలను భావితరాల వారికి అందజేయ కలిగి వుండాలి. అంటే యీ వర్గాలపై గురుతరమైన బాధ్యత వుందన్నమాట సమాజములో ఉపరితలములోగాన వస్తున్న రూపురేఖలను కాకుండ, అంతర్గతమై, అంతర్లీనమైవున్న శక్తు

లను, అంశాలను అవగాహన చేసుకొని వానిని ప్రణాళిక రచనల్లో ఉప యోగించుకొనే శక్తి సామర్థ్యాలు కలిగి వుండాలి. అలా సమస్త ప్రజానీకము సూక్ష్మంగ, తుల నాత్మకంగా, చిత్తశుద్ధిగ సాంఘిక పరివర్తనమును ఆకాంక్షించి, కృషిచేసిననాడు, సమాజము కొత్త తొడుగులను తొడిగి, శాంతికి సహనతకు, సమానత్వానికి మారుపేరు కాగలదు. అటువంటి శాస్త్రీయ దృక్పథము పెంపొందుతుందనే ఆశిద్దాము.



# జీవితం–సాహిత్యం

## కాళోజీ నారాయణరావు

మొట్ట మొదట ఒక విషయాన్ని స్పష్టం చెయ్యాలి. ఈ "విమర్శ" అనేది అటు పాఠకులకూ ఇటు రచయితకూ సంబంధించినది కాదు. అంటే సాహిత్య నిర్మాణంలో విమర్శ ఒక అంగం కాదు. రచయిత అయినవాడు పరిసరాలను పరిశీలిస్తాడు; అధ్యయనం చేస్తాడు. పరిసరాలే రచయితను ప్రభావితుణ్ణి చేస్తాయి. ఆ ప్రభావంతో రచన చేస్తాడు, అంతే గాని విమర్శకులు తన రచనను చదివి ఏవిధమైన అభిప్రాయాలను వెలిబుచ్చుతారు? అన్నదాన్ని ఆధారంచేసుకుని ఏ రచయితా రచన చెయ్యడు ఏ రచయితన్నా అట్లాచేస్తే అంత దిగువ రకం రచయిత మరొకడు వుండడు. పరిసరాల నుండి పొందే స్పందనవల్ల రచన చేసేవాడే రచయితగాని విమర్శకుణ్ణి దృష్టిలో పెట్టుకుని రాసే రచయిత రచయితే కాదు.

మానవజీవిత విమర్శకుడు రచయిత. సమాజం విలువలు; సంప్రదాయాలు; ఆదర్శాలు; ఆచరణ, ప్రేమ, కరుణ, ద్వేషం, దుఃఖం,

ఆనందం ఇట్లాటి అనేకానేక భావపుంజం అయిన మానవజీవితం విమర్శే రచన. మళ్లీ రచన మీద విమర్శ ఏమిటి? అర్థంలేని మాటకాకపోతే!

ఇక పాఠకుని దృష్టితో చూద్దాం. పాఠకుని విమర్శ ప్రయోజనం ఏమీ లేదు. రచనను నేరుగా చదివి అందులో స్వారస్యాన్ని ప్రత్యక్షంగా ఆస్వాదించడానికి పాఠకుడికి స్వేచ్ఛకావాలె. ఈ స్వేచ్ఛకు విమర్శకుడు అడ్డు తగిలి తానేదో వ్యాఖ్యానం చేస్తానంటాడు. పాఠకుణ్ని ఎట్లాంటి తప్పు దారులు పట్టించినా పట్టించవచ్చు. రచన స్వయంగా చదివి ఆనందించగల వాడే పాఠకుడు. విమర్శకుని సలహాప్రకారం చదివేవాడు పాఠకుడు కాదు: విద్యార్థి కావచ్చునేమో. "విమర్శ"ను పాఠకుడు ఏనాడూ ఆదరించలేదు. ఏ పుస్తక విక్రేతను అడిగినా ఈ విషయం రుజువతుంది. విమర్శకుణ్ని పాఠకుడు పట్టించుకొనేలేదన్నది అనేకసార్లు అనేక సందర్భాలలో రుజువైంది. ఉదాహరణకు గురజాడను "అకవి" అని విమర్శకులు ప్రచారం చేసినంతమాత్రాన పాఠకులు ఆయన రచనలను ఆదరించడం మానినారా? విమర్శయొక్క ఉపయోగం మళ్ళీ విమర్శకులు కాదలచుకున్న వారికి తప్ప పాఠకులకూ లేదు; రచయితలకూ లేదు.

విలువలుమారటం సహజం. తరతరాలుగా విలువలు మారుతూనే ఉన్నవి. ముందుకూడా మారుతూనే ఉండగలవు. అయితే ఇక్కడ మరొక భ్రమ విషయం ప్రస్తావిస్తాను. సమాజంలో విలువలను మార్చగలనన్న విశ్వాసం, మారుస్తునాన్న ధీమా, మార్చవలెనన్న ఆతురత రచయితకు ఉంటుంది. అదంతా వట్టి భ్రమే. రచయితకు ఉండే ఆతురతను బట్టి గాని అతనికుండే ధీమాకు అనుగుణంగాగాని విలువలు మారవు.

సమాజంమీద సాహిత్యం వేసే ముద్ర అతిస్వల్పం; అత్యంత తాత్కాలికం. ఉదాహరణకు వాల్మీకి రామాయణం రాయకముందు

మానవ సమాజంలో ఏక పత్నీవ్రతులు లేరా? ఇతరుల భార్యలను ఎత్తుకొనిపోయే రావణునివంటివాళ్ళులేరా? ఉండే ఉండాలె. ఎవడూ రామాయణం విన్నందువల్ల ఏక పత్నీవ్రతుడు కావటం లేదు. అదేవిధంగా ఇతరుల భార్యలను ఎత్తుకునిపోయే అలవాటు లేదా తత్వం ఉన్నవారు రామాయణం విని తమ అలవాటును లేదా తత్వాన్ని మార్చుకోవటం లేదు. ఆధునిక సాహిత్యంలో నుంచి ఉదాహరణలు తీసుకోండి. ముని మాణిక్యం వారి కాంతం కథలను చదివిన తర్వాతనే సంసార పక్షానికి మారిన స్త్రీలు ఎంతమంది ఉంటారు. చలం నవలలను చదివి కుటుంబ జీవితాన్ని అరాచకంగా మార్చుకున్న వారెందరు? ... ఉండరనే నా విశ్వాసం. ఉండే బహు స్వల్పం. వారి పుస్తకాలు అమ్ముడుపోయిన దానితో, ఆగ్రంథాల పాఠకుల సంఖ్యతో పోల్చినప్పుడు ఇటువంటి వారి సంఖ్య నగణ్యం.

ఎవరైనా ఒక వ్యక్తి ఏకపత్నీవ్రతుడో, సంసారపక్షో, లేదా విప్లవ వీరుడో అవుతున్నాడంటే అతడు రామాయణం, కాంతం కథలు లేదా మహాప్రస్థానం పాఠకుడైనందువల్ల కాదు. అతని వ్యక్తిగత టెంపరిమెంటు వల్ల టెంపరిమెంటు వ్యక్తికి ఒక రకమైన సంస్కారాన్ని అభిరుచులనూ అలవాట్లనూ కలుగజేస్తుంది. ఆ సంస్కారాన్ని, అభిరుచులనూబట్టి ఆ వ్యక్తి తన అభిమాన రచయితలనూ, సాహిత్యాన్నీ ఎంచుకుంటాడు. రచన పట్ల పాఠకునికి ఏర్పడే అభిమానం రచన యొక్క విశేషంకాదు.

'నాగొడవ' మొట్ట మొదటిసారిగా అచ్చులో పుస్తకంగా వేసినప్పుడు నేను రాసిన నాలుగైదువాక్యాలను ఇక్కడ మళ్ళీ పేర్కొంటాను.

"ఆనందమో, ఆవేదనో కలిగినప్పుడు వచ్చిన భావాన్ని వెలిబుచ్చడం జరిగింది. అది ఇతరులకు కాకున్నా వెలిబుచ్చినవానికి బాగా

నచ్చింది. ఇతరులకుకూడా నచ్చుతే విశేషం. ఈ విశేషధర్మం కైతకే మాతం ఆధారం కాదు. దానికి మూలం, ప్రాణం కవికి అప్పుడప్పుడు కలిగిన ఆవేదన, ఆనందం మాత్రమే.

ఎన్నో సంఘటనలు జరుగుతుంటవి మన చుట్టు పట్టు ఒకే సంఘటన అందరినీ ప్రభావితులను చేయదు, ఒకే రీతిన అసలే చేయదు.

(ప్రసారయంత్రం ఒకటే అయినా స్వీకరించే యంత్రాలు తమతమ శక్తితో దానిని గ్రహిస్తవి. యంత్రాలలో అన్ని విధాల సమానశక్తి గల పరికరాలను నిర్మించవచ్చు. మానవుల నిర్మాణం అట్లా జరగలేదు. మనకు "ఏదైనా శక్తినిబట్టి సాక్షాత్కారం భావానుగుణ్యం రూపం.")

* *

మానవ జీవితానికీ సాహిత్యానికీ అనేక పోలికలున్నవి. (జీవితం వంటిదే సాహిత్యం. జీవిత ప్రతిబింబమేకదా! జీవితంలో ఉన్నంత వైవిధ్యం సాహిత్యంలోనూ ఉంటుంది. మానవ జీవితానికి ఒక ఖచ్చితమైన నిర్వచనం, ఒక ఖచ్చితమైన పద్ధతి లేనట్లే సాహిత్యానికీ లేదు. ప్రతి సాహిత్య స్రష్టదీ ఒక ప్రత్యేకమైనదారి. ఎవరిదారి వారిదే.)

మానవులందరూ ఈ దారుల్లోనే నడవాలి; ఫలానా సమయాన దుఃఖించాలి; ఫలానా సమయంలో నవ్వాలి అని ఖచ్చితమైన సూత్రాలు చేస్తే వాటి ఆచరణకన్నా ఉల్లంఘనే ఎక్కువ జరుగుతుంది. రచయితల విషయంలోనూ అంతే. సాహిత్యం అంటే ఇల్లా ఉండాలని ఖచ్చితమైన సూత్రాలు చేస్తే ఉల్లంఘనలో జరిగినంతగా ఆచరణలో జరుగదు.

అయితే విమర్శకులూ, ఆలంకార శాస్త్రజ్ఞులూ కొన్ని సూత్రాలనూ పద్ధతులనూ రూపొందిస్తూనే వుంటారు ఆ పద్ధతులన్నీ ట్రంకురోడ్ల వంటివి. కార్లు, సున్నితమైన వాహనాలను ఉపయోగించే స్వల్ప సంఖ్యాకులకు మాత్రమే వాటి ఉపయోగం. బహు సంఖ్యాకులైన పేదవారికి వాటి

ఉపయోగం ఉండదు. బహు సంఖ్యాకులైన పేదలు కాలిబాటనే వాడు తారు. ట్రంకురోడ్డుమీది నడకకు వేగం, దిశ మొదలైన కట్టుబాట్లు అనేకం వుంటాయి. వాటి ప్రకారం నడుచుకోవలసిందే. అందే ట్రంకు రోడ్డుమీది నడకలో నడిచేదానికి స్వేచ్ఛ ఉండదు. అడుగులు వేయటంలో తమ స్వీయ ధోరణిని చూపించడానికి "స్వ"ను ప్రదర్శించడానికి వీలులేదు. కాలి బాటలో అల్లాకాదు. ప్రతి బాటసారీ ఆ కాలిబాటమీద వేసే అడుగులు వేరువేరుగా వుంటవి. ప్రతి నడకలోనూ వైవిధ్యం ఉంటుంది. (ఏ బాట సారైనా అంతకుముందునుంచి వేసివున్న కాలిబాట తనకు అసౌకర్యంగా ఉన్నదని భావిస్తే, అంతకన్నా సౌకర్యవంతమైన కొత్త కాలిబాటను నిర్మించుకుంటాడు. బహుజనుల బాట కాలిబాట. వైవిధ్యం ఉండగల బాట, బాటసారికి స్వేచ్ఛ ఉండేబాట)

ఒక పద్ధతిని - సిద్ధాంతాన్ని ఏరుకొని దాని ప్రకారం నడకను సూత్రబద్ధం చేసుకోవటం- అట్లాంటి జీవితాన్ని ట్రంకురోడ్డుతోనూ, స్వేచ్ఛా జీవితాన్ని కాలిబాటతోనూ పోల్చవచ్చు. ట్రంకురోడ్డు మీద నడిచే బాటసారికీ, కాలిబాటన నడిచే బాటసారికీ ప్రయాణం సామాన్యగుణం అయినట్లు సూత్రబద్ధ జీవితానికీ, స్వేచ్ఛాజీవితానికి జీవితం సామాన్య గుణం.

ట్రంకురోడ్డు, వాహనాల మీద- కార్లమీద తదితర శకటాలమీద ప్రయాణం ప్రగతికి చిహ్నమని, లక్ష్యానికి వేగంగా త్వరగా చేరుస్తాయని ఒక భ్రమవున్నది. అది వట్టిభ్రమే. వాస్తవం దానికి పూర్తిగా భిన్నం. కాలిబాట అనేది పయనించిన చోటినుండి చేరవలసిన లక్ష్యానికి సర్వదా దగ్గరి దారి అయివుంటుంది. అంతేకాక, సాంకేతిక యంత్ర సంబంధ వైఫల్యాలు, తదితర ప్రమాదాలూ, కాలిబాట బాటసారికి ఉండవు. అందు కని కాలిబాట అనాగరిక, ఆటవిక సంప్రదాయమనీ, ట్రంకురోడ్డు ఆధునిక

మైనదీ నాగరికమైనదీ అన్న వాదంలో పసలేదు. పోతే జీవితలక్ష్యం ఆనందప్రాప్తి.(ఆనందప్రాప్తి సులభంగా, సురక్షితంగా సాధ్యపడేది కాలిబాటవంటి స్వేచ్ఛా సాహిత్యంద్వారా ఆనందప్రాప్తి దూరం చేసేది, దుస్సాధ్యం చేసేది నాగరికత అయితే - నాగరికత కోసమే నాగరికతను ఆరాధించ వలసి వస్తుంది. ఆనందప్రాప్తి అన్న లక్ష్యానికి తోడ్పడని నాగరికత ఎందుకు ?)

సామాన్య మానవునికీ రచయితకూ తేడా ఎక్కడ వుంటుందో పరిశీలిద్దాం, కట్టు బొట్టులో, ఆచార వ్యవహారాల్లో ఈ ఉభయులకూ తేడా ఉండదు. తేడా అంతా భావవ్యక్తీకరణ ప్రతిభలో ఉంటుంది.

ఏ కాలంలోనైనా సరే, అప్పటికి అమలులో వున్న రాజకీయ, సాంఘిక నియమాలూ, విలువలూ కట్టుబాట్లూ అనేక మంది వ్యక్తులకు తమతమ వ్యక్తిగత జీవితాలలో అసౌకర్యంగా ఉంటాయి. వాటివల్ల సామాన్యునికి అసంతృప్తి ఉంటుంది. అయితే వాటిని ధిక్కరించడంవల్ల ఏర్పడే అసౌకర్యాలు మరింత దుర్భరంగా, భయంకరంగా ఉంటాయన్న భయంచేత నైతేనేమి అసౌకర్యాలను చాటుమాటుగా దాటవేసుకునే సుళువులు ఉండడంవల్ల నైతేనేమి అమలులో ఉన్న సాంఘిక కట్టుబాట్లనన్నింటినీ ఖచ్చితంగా పాటిస్తున్నట్లే కనబడి, వ్యక్తిగత జీవితంలో చాటుమాటుగా, వీలుచిక్కినప్పుడల్లా, తన సౌకర్యంకోసం ప్రతివ్యక్తి వాటిని ఉల్లంఘిస్తూ వుంటాడు. రచయితకూడా ఇందుకు అతీతుడుకాడు. నడక లేదా ఆచరణ వరకు అతడు అందరివలెనే సాంఘిక కట్టుబాట్లను తన సౌకర్యంకోసం ఉల్లంఘిస్తూనే వుంటాడు. అయితే సామాన్యుల మనస్సుల్లో ఉన్న అసంతృప్తిని అమలులో ఉన్న విలువలు, కట్టుబాట్లు మారాలన్న ఆవేదనను ఆతురతను రచయిత వ్యక్తపరుస్తాడు. సామాన్యులు

వ్యక్తం చేయలేరు. రచయిత వ్యక్తం చేసిన భావాలు సామాన్యులు వ్యక్తం చేయాలని తపన పడుతున్న భావాలే. కానీ వ్యక్తీకరణ సామాన్యునికి సాధ్యపడదు. రచయితకు సాధ్యపడుతుంది. అంతే తేడా.

రచయిత ఏహో ఒక విశ్వాసానికి లేదా తత్వానికి కట్టుబడి ఉంటే అనగా "కమిటెడ్"అయితే సదరు వ్యక్తీకరణముకూడా స్వేచ్ఛగా చెయ్య లేడు. "కమిటెడ్" లేదా కట్టుపడ్డ మనిషి రచయిత కాలేడు.

రచయిత అయినవాడు ఏదో ఒక సిద్ధాంతానికి లేదా తత్వానికి కట్టుబడి ఉండాలన్నవాదం ఇటు రచయితనూ అటు సిద్ధాంతాన్ని గోతి లోకి తోసే వాదమే. రెండువైపులా ప్రమాదాలే.

మనం ఒక్క సంగతి స్పష్టంగా గుర్తించాలి. మార్క్సిజం, గాంధిజం, సోషలిజం, కాపిటలిజంలాంటి సిద్ధాంతాలూ, తత్వాలు సామా జిక లేదా రాజకీయ వ్యవస్థా విశేషాలు; కవితా విశేషాలో; కళావిశేషాలో లేదా కనీసం భావ వ్యక్తీకరణ విశేషాలో కావు.

రచయిత ఏదైనా తత్వానికి లేదా సిద్ధాంతానికి కట్టుబడిపోయినట్ల యితే ఉభయ భ్రష్టత్వానికి ఎలా గురవుతాడో పరిశీలించండి.

1. కట్టుపడిపోయి వున్నందువల్ల ఆయా సిద్ధాంతాల ప్రచారకుల లేదా నాయకులకు ఉపకరించే రచనలు, వారి మార్గాన్ని సుగమం చేయడానికి ప్రయోజనపడే రచనలనే చెయ్యవలసి రావడం వల్ల "స్వ"ను రచయిత వ్యక్తీకరించలేడు. ఈ విధంగా ఆత్మహత్యకు పూనుకొనవలసిన ఆగత్యం తప్పనిసరి అవుతుంది.

2. ఏ సిద్ధాంతానికి కట్టుబడతాడో దానికి కమాండరూ కాలేడు. సిద్ధాం తాన్ని నిర్వచించేవాడూ, నడిపించేవాడూ, సిద్ధాంత ప్రకారం,

లేదా సిద్ధాంత సాధనకోసం జరిగే పోరాటాలకు నాయకత్వం వహించేవాడు వేరే మరొక సిద్ధాంతకర్త. మావో-లెనిన్-గాంధీ-లోహియా - బుద్ధుడు వంటివారు వేరే ఉంటారు.

3. తాను ఏ సిద్ధాంతానికి కట్టుబడిపోతాడో అందులో తన్మయుడై పోయి, భావావేశంలో పడి దాన్ని వర్ణించే పద్ధతిలో, ఆ సిద్ధాంతాన్ని అనుసరించదలచుకున్న అనేకమంది సామాన్యులను, అజ్ఞానులను స్వయంగా "మానిఫెస్టో" చదివి అర్థంచేసుకోలేని వారిని ఈ రచయిత రచనలద్వారా స్ఫూర్తిని పొంది రంగంలో దుమికే వారిని సిద్ధాంతపరంగా తప్పుదారి పట్టించే ప్రమాదం కూడా వున్నది. భారతీయ వేదాంతాన్ని బోధించడానికి పురాణాల్లో కవులు వాడిన ప్రతీకలన్నీ ప్రధానపాత్రలుగా తిష్ఠవేసుకుని, పూజలూ, పునస్కారాలూ అందుకుంటూ అసలు భావాన్ని గాలికి విసిరేసిన సంఘటనలు ఎన్నిలేవు;

కట్టుబడిన రచయిత తన రచనలద్వారా మహాఅయితే "కంపెనీ వస్తువుల"ను విరివిగా అమ్మటానికి ఉపయోగపడే మంచి పోస్టరును సృష్టించగలడు. మంచి పోస్టరుగా ఉపయోగపడగలడు. అంతే.

అయితే సాహిత్యానికి ఏ ప్రయోజనమూ లేదా ? అన్న ప్రశ్న రావచ్చు. ఉన్నది సాహిత్యం సాధించవలసిన బృహత్తర ప్రయోజనం ఒకటి వున్నది. మరెవ్వరూ సాధించలేనిదది. సాహిత్యకారులు, రచయితలు పూనుకుంటేతప్ప సాధ్యంకాని ప్రయోజనం

మన విజ్ఞాన శాస్త్రాలన్నిటికీ, సిద్ధాంతాలకూ తత్వాలకూ లక్ష్యం "సర్వేజనా స్సుఖినోభవంతు." దాన్నే మొట్టమొదటిసారిగా ఫ్రెంచివిప్లవం సందర్భంగా "స్వాతంత్ర్యం-సమానత్వం-సౌభ్రాతృత్వం" అని మరింత

స్పష్టంగా నిర్వచించారు.) ఈ మూడు ఉన్నప్పుడే సర్వేజనా స్సుఖినో భవంతు లక్ష్యం సిద్ధిస్తుంది. అయితే ఈ మూడింటిలో చివరన పేర్కొన్న సౌభ్రాతృత్వం అనే లక్ష్యం మిగతా అన్నింటికీ మూలాధారం స్వాతంత్ర్య రక్షణకైనా, సమానత్వ సాధనకైనా మొట్టమొదటగా కావలసిన ప్రీరిక్వి జిట్ సౌభ్రాతృత్వం.

రాజకీయ విప్లవాలద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించవచ్చు. విప్లవా నంతరం ఏర్పడిన ప్రభుత్వాలు తమ కృషిద్వారా సమానత్వాన్ని స్థాపించ వచ్చు. కాని సౌభ్రాతృత్వం లేనిదే ఈ రెండింటివల్ల కలిగే ఫలితం "సర్వే జనులకు" చెందదు.

ఇంతవరకూ ప్రపంచ మానవాళికి, రాజకీయ విప్లవాల ద్వారా స్వాతంత్ర్యం అందినది. విప్లవానంతరం ప్రభుత్వాలు కొన్ని చిత్తశుద్ధి తోనూ, నిజాయితీతోనూ కృషిసల్పి మానవత్వాన్నికూడా సాధించినాయి. కాని సౌభ్రాతృత్వం మానవజాతి అందుబాటులోనికి రాలేదు. ఎందుకని ?

రాజకీయ విప్లవాలద్వారా సౌభ్రాతృత్వం సాధ్యపడేదికాదు కనుక సమానత్వ స్థాపనకోసం రూపొందించే ప్రణాళికలుగానీ, సోషలిస్టు చట్టాలుగానీ సౌభ్రాతృత్వాన్ని సాధించజాలవు కనుక. సౌభ్రాతృత్వానికి కృషి చేయవలసింది రాజకీయ నాయకులూ, విప్లవకోవిదులూకారు; రచ యితలు.

రచయిత ఇన్నాళ్ళూ తన స్థానాన్ని తాను వేరుగా ఏర్పరుచుకో లేదు. స్వాతంత్ర్యానికి లేదా సమానత్వానికి జరిగే కృషికి, పోరాటానికి లేదా విప్లవానికి వత్తాసుగా నిలిచినాడు. అంటే మిగతావారి రంగాలలో పడిపోయి తన రంగాన్ని విస్మరించినాడు. అందువల్ల సాధించుకున్న స్వాతంత్ర్యమూ, సమానత్వ స్థాపనకు జరిగిన ప్రయత్నమూ ఫలించ కుండా పోతున్నాయి.

రచయిత తన విధిని, బాధ్యతను గుర్తెరిగి సౌభ్రాతృత్వసాధనకు కృషి చెయ్యడమే తన ధర్మంగా నిర్వచించుకుని ఆ పరిమితరంగంలో కృషి జరిపినట్లయితే రాజకీయ నాయకులు విఫలమైనచోట రచయిత విజయం సాధించి మానవజాతికి మహోపకారం చెయ్యగలడు.

ఒక్కటే షరతు-మొదటి రెండింటిలో నిమగ్నమైపోయి, తన భాగాన్ని రచయిత విస్మరించరాదు.

రచయిత కృషివలన సౌభ్రాతృత్వం రాగలదా అను ప్రశ్న అటుంచి ఏ వర్గానికీ ఏ సిద్ధాంతానికీ కట్టుపడకుండా వర్గాలు, సిద్ధాంతాలలో ఉన్న లోపాలకు తలవంచకుండా వారివర్గాల సిద్ధాంతాల తు.చ. తప్పని నడవడిని స్వీకరించే గొర్రెదాటు విధానం కాకుండా మానవ సమాజము లోని సమానతను, అది నెలకొలిపే స్వాతంత్ర్యానికి మూలాధారమైన సౌభ్రాతృత్వాన్ని దానికి సంబంధించిన భావనను తన రచనలద్వారా కలిగించి తన కనీసబాధ్యతను నెరవేర్చిన చాలని నా అభిప్రాయం.



# రచయిత బాధ్యత

## గోరాశాస్త్రి

"సామాజిక విలువలు" మారుతున్నాయి. మార్పు గమనించే రచయిత, గమనించవలసిన రచయిత, ఎటువంటి సాహిత్యాన్ని సృష్టించాలి ? రచయితగా సంఘంపట్ల తన బాధ్యతను ఏవిధంగా నిర్వహించాలి?"

చాలా సంక్లిష్టప్రశ్న; అనేకానేక వృత్తులు చేబట్టిని వారున్నారు కదా, అందరికి అంతోయింతో బాధ్యతలు ఉంటాయికదా, వారందరికంటె రచయిత ఉన్నతుడా? అనే ఎదురు ప్రశ్న సహజంగా ఉదయిస్తుంది

ఇంకొక ప్రశ్న :- సమాజంపట్ల రచయితకు బాధ్యత - అనగా అదనమూ, ఉన్నతమూ ఐనది-ఉందని ఒకవేళ మాటవరుసకు అంగీకరించినా, ఏకపక్ష బాధ్యతలుండనేరవు; సంఘానికికూడా రచయితపట్ల బాధ్యత ఉండితీరాలి; హక్కులూ, బాధ్యతలూ "బొమ్మా-బొరుసూ" వంటివి.

"సాహిత్యాన్ని" లలిత కళలలో చేర్చారు; అన్ని దేశాలవారూ యుగయుగాల నుండి సాహిత్యానికి మహోన్నత స్థానం యిచ్చారు;గానం, శిల్పం, చిత్రలేఖనం, అలాంటివన్ని లలితకళలని, కొండగుహలలో నివసించే ఆదిమ మానవుడు నేడు ఇంత నాగరికతనూ విజ్ఞానాన్నీ సాధించి, ప్రకృతినే జయించగలిగాడంటే, అతడి సృజనాత్మక శక్తి కారణమని మేధావులన్నారు.

స్వాతిశయాన్ని దూరంగా ఉంచి, కొంచెం నిశిత పరిశీలన చేస్తే విచిత్రాంశాలు ఆవిర్భవించి, మనల్ని సవాల్ చేస్తాయి.

గానం మానవులను పరవశుల్ని చేస్తుంది; అలౌకిక ఆనందాన్నిస్తుంది; గానవాహినిలో తన్మయులై, తమ జీవితాలను భగవంతుని ఆరాధన కోసమో, ప్రేయసి అనుగ్రహం కోసమో, అంకితమిచ్చి, కర్పూర నీరాజనం వలె వెలిగించి, హరించి తరించామనే ఆత్మసంతృప్తిలో కనుమూసినవారు ప్రతి శతాబ్దంలోనూ ఉన్నారు.

లలితకళలన్నింటిలోనూ, శాశ్వతత్వ భాగ్యరేఖకు నోచుకోనిది గానకళ; ఈ శతాబ్దపు వైజ్ఞానిక ప్రగతి ప్రసాదించిన రకరకాల "రికార్డింగ్" యంత్రాలు గాయకులకు "అంక సిద్ధార్థ పేటి" వంటివి; ముందు తరాలవారికి తమ గానసుధను భద్రపరిచే అవకాశం లభించింది; అంతకు పూర్వం ? - శుభనామధేయం ఒక్కటే చరిత్రలో నిలిస్తే చాలునా ?

మీరాబాయ్ కంఠమాధుర్యం, వేనవేల హృదయాలలో కృష్ణభక్తిని పాదుకొల్పిన మంజులగానం, ఇవాళ మనం వినలేము; అలాగే తాన్‌సేన్, కబీర్, చైతన్య మహాప్రభువు; వారి గాన సుధారసంలో సుల్తానులూ శుద్ధ శుంఠలూ, రారాజులూ, కరిగిపోయారు. ఐతే, ఆయా గాయన

గాయనీమణుల తుది శ్వాసతోపాటు వారి అమరగానం కూడా వాయువులో లీనమైపోయింది.

వాళ్ళు రచించిన గీతాలు నేటికీ నిలిచాయి కదా ? - త్యాగరాజు కృతులు శ్రవణపేయంగా అనుదినమూ విని ఆనందిస్తున్నాము కదా ? - అక్షరాలా నిజం; వాళ్ళు కేవలం గాయకులు కారు; వాగ్గేయకారులు; వాళ్ళ రచనల్ని ఎవరో పాడుతూంటే వింటున్నాము; త్యాగయ్య ఎలా పాడేవాడో మనకు తెలుసునా ? "Gone with the wind"-అంతేగదా ?

ఇక్కడ సంగీత శాస్త్రప్రసక్తి ఇమడదని మనవి; ప్రతి లలిత కళకూ శాస్త్రీయ ప్రాతిపదిక విధిగా ఉంటుంది. శాస్త్రీయ పరిజ్ఞానం లేనిదే ఎవడూ కళాకారుడు కాలేడు; ఐతే, కళాసృష్టికి శాస్త్రపరిజ్ఞానం ఒక్కటే చాలునని భావించడం వెర్రితనం.

సంగీతకళ తరువాత శిల్పం, చిత్రలేఖనం, వాటిగురించి ముచ్చటించాలి: తన్మాత్రం చాలును; శిల్ప, చిత్రలేఖన సౌందర్యసృష్టి వందల సంవత్సరాలు నిలుస్తుంది.

ఇంతవరకూ - రేఖామాత్రంగా వివరించినది యవనిక వలె విని యోగపడుతుందని భవదీయుడి ఆశ. పోనీ-- తాపత్రయం; యవనికలేని భావ వ్యక్తీకరణ బోసిగా ఉండదా ?

ప్రకృతాంశం - "మారుతున్న విలువల" నడుమ రచయిత బాధ్యత.

"విలువలు" అనగా సాంఘిక, సామాజిక జీవనం, వైజ్ఞానిక ప్రగతి స్థితి, రాజకీయ వ్యవస్థ, ప్రభుత నడిచే తీరుతెన్నులు, మత విశ్వాసాలు, జాతీయ సంపద ఉత్పత్తి పెంచే అవకాశాల పెరుగుదల వాటి ఆరోగ్యం, రుగ్మత—యివన్నీ, ఇంకెన్నెన్నో కలిసి, మనిషిని అటూ యిటూ ఊగిసలాడించే శక్తుల సంపుటి.

వీటిలో ప్రతిఒక్క అంశానికీ రచయిత అనేవాడు రకరకాలుగా అనుస్పందిస్తాడు కొన్ని భావాలు ఆతనిలో గూడుకట్టుకుంటాయి; గూడు స్థిరంగా ఉన్నా, కొన్ని భావాలు, లేదా విశ్వాసాలు, పోనీ అభిప్రాయాలు గూటినుండి పారిపోతుంటాయి. కొత్తభావాలు ప్రవేశిస్తాయి.

కోర్టుతో పనికలిగిన పార్టీలు లాయరుకు కావాలి; వైద్యుడికి రోగులు అవసరం; ఉపాధ్యాయుడికి తాను చెప్పే చదువు నేర్చుకోవడానికి విద్యార్థులు కావాలి; లాయర్లకూ, డాక్టర్లకూ, వాళ్ళ "క్లయింటు"లే డబ్బిస్తారు — ఉపాధ్యాయుడికి ప్రభుత్వమో, ప్రయివేటు సంస్థలో; జీతం యిస్తాయి. చిత్రకారుడు, గాయకుడు, శిల్పి, నటుడు, అందరికీ డబ్బు యిచ్చే వాళ్ళుంటుంటారు. శ్రమ శక్తికి మూల్యం దొరక్కపోతే, శ్రమించడం దేనికి ? కళాకారుడికి, లేదా, ఒక వృత్తిని చేపట్టినవానికి లభించే ప్రతిఫలంలో అనంత వ్యత్యాసాలుంటాయి. వాటికి కారణాలుంటాయిగాని సమంజసం అనదగినవి చాలా తక్కువ. "అయ్యబాబోయ్!" అనుకునేటంత ఎక్కువగానూ, "అయ్యో పాపం !" అని బాధకలిగించేటంత స్వల్పంగానూ ఉంటాయి. వీధి గాయకుడికి వాడవాడలా తిరిగి రోజంతా పాటలు పాడితే, దొరికే బిచ్చం మహాఐతే రెండురూపాయలు. అతడు అద్భుతమైన గాయకుడు కావచ్చును; "ఆహా ! ఎంత అమృతకంఠం ! అంటారు విన్నవాళ్ళు; అంటూ పదిపైసలు పడేస్తారు. చలనచిత్ర నిర్మాణ పరిశ్రమలో "ప్లేబాక్" గాయకుడికి ఒకపాటకు రెండు, మూడు వేల రూపాయిల ప్రతిఫలం దొరుకుతుంది. వినాయక చవితి పండుగకోసం, మట్టితో గణపతి ప్రతిమను ఎంతో వినాణ్ణంగా మలచిన శిల్పికి ప్రతిమ సైజును బట్టి యాభై పైసలో, ఒకరూపాయో, ధర కిడుతుంది దేవీ ప్రసాద్ రాయ్ చౌధురీవంటి శిల్పి అదే "సైజు" విగ్రహాన్ని-ఏదైనాసరే; తయారుచేస్తే అథమపక్షం పదివేలరూపాయలు రాలిపడతాయి.

"ఇత్యాది ఉదాహరణలను ఊహించవలెను"

ఇంక - "రచయిత" అనిపించుకున్న విచిత్ర జీవి సంగతి ? - సాహిత్య విపణివీధిలో ధరలుకూడా గమ్మత్తుగా ఉంటాయి ఇవాళ సాహిత్యానికి ''మహారాజ పోషకులు'' :- (1) పత్రికలవాళ్ళు, (2) పుస్త కాల పబ్లిషర్లు; (3) రేడియో ప్రసారకేంద్రాల అధికారులు: (4) చెదురు వాటుగా రాష్ట్ర, కేంద్ర, ప్రభుత్వాలకు చెందిన కొన్ని శాఖల అధిపతులు (5) చలనచిత్ర నిర్మాతలు; (6) సాహిత్య ''అకాడమీ'' సారధులు.

పై వర్గీకరణలో క్రమాలంకార సూత్రాన్ని పాటించలేదు క్రమా లంకారవృద్ధి (ప్రతిఫలం ప్రమాణంగా) ఇలా ఉంది :- అందరికంటే పిసి నార్లు, లుబ్ధాగ్రేసర చక్రవర్తులు. - రేడియో వాళ్లు అర్థికశాస్త్ర పరిభాషలో Buyer's market, Seller's market అని రెండు అవస్థా విభేదా లున్నాయి :- రేడియో వాళ్ళది సర్వదా, సర్వథా,- BUYER'S MARKET. కృష్ణశాస్త్రి కవితకూ, చనుబాలకవి కిష్టయ్య కవితకూ,- ఒకటేరేటు బేరంలేదు.

పత్రికలలో రకాలున్నాయి :- వాటిలో కొన్ని ఐరావతాలు :- చాలాభాగం "సన్నకారు రైతాంగం" కోవకు చెందుతాయి :- భారీ పత్రికలు కొంచెం సంతృప్తి కలిగించే ప్రతిఫలం రచయితకు యిస్తాయి:- ఐతే, వాళ్ళది "CLOSED SHOP" వంటి విధానం :- ప్రతి పత్రి కకూ [యించు మించు] "ఆస్థాన రచయితలు''న్నారు. కొంత కాలం నుండి "స్టాక్ వ్యాల్యూ" పద్ధతిని పత్రికలు కూడా అనుసరిస్తున్నాయి:- "రాసిన దేమిటి" — వస్తునాణ్యం అక్కరలేదు :- ''రాసినదెవరు?'' సాహిత్య విఫణివీధిలో కొంచెం పేరుతెచ్చుకొన్న వారికి ఎక్కువ ప్రతి ఫలం : ''ఫలానా రచయిత/రచయిత్రి మార్కు నవలల్నీ, కథలనూ

వాడండి." అదీ నినాదం; ప్రస్తుతం రచయిత్రుల రచనలకు గిరాకి ఎక్కువ : ధారావాహికంగా, నేడు వెలువడే "నవలారాజాల"ను నారీ రత్నాలు అవలీలగా వండేస్తున్నారు : సదరు వంటకాలకోసం పాఠకులు ఎగపడుతున్నారు. నవీన 'కాశీమజిలీ' కథలు పునర్జన్మ ఎత్తాయి : వాటినే నవలలు అంటున్నారు

పబ్లిషరులుకూడా పుస్తక ప్రచురణను పకోడీల వ్యాపారంగా మార్చే శారు : పత్రికలకంటే ఎక్కువ ప్రతిఫలాన్ని కొందరు పబ్లిషరులు యిస్తారుగాని, శ్రమకూ, రచయిత మౌలిక ప్రతిభకూ తగిన ప్రతిఫలమా అది ? ఎంత మాత్రం కాదు

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల కృపారసం పింఛనీ తీసుకొనవలసిన రచయితలపైనా, పైరవీ రచయితలపైనా, వర్షిస్తుంది : "అకాడమీ" పాలసీ డిటో.

రచయితలకు నేటి భోజ మహారాజులు సినిమా నిర్మాతలు : ఆరు పంక్తులు దాటని చెత్త పాటకు వెయ్యిరూపాయిలు కూడా యిస్తారు : ఐతే సినిమారంగం అక్షరాలా అభినవ భోజుని ఆస్థానం : అష్టదిగ్గజాలు భోజుడిని బంధించాయి : అంతేగాక, నేటి భోజుడికున్న అంధవిశ్వాసాలు అనంతం, ఆజ్ఞలు అపారం. ఫ్యూడలిజాన్ని నిరసించే "కొమ్ములు మొల చిన" రచయితలు, వేదికలపైన సింహనాదాలు చేస్తారు : అభ్యుదయం గురించి, రచయిత బాధ్యత గురించి, అభినవ లెనిన్‌వలె మాటాడతారు సినిమారంగంలోని ఫ్యూడలిజాన్ని మాత్రం కంటికి రెప్పవలె సంరక్షిస్తారు: నిర్మాత మహారాజులకు సుబేదారులవలె వ్యవహరించడానికి తహతహలాడే రచయిత, సాహిత్య సభల వేదికలపైన ఉపన్యసిస్తాడు.

రచయిత ఎవరికి బాధ్యుడు ? పత్రికల అధిపతులకు, ఆకాశవాణి వారికి, పబ్లిషర్లకు, సినిమా నిర్మాతలకు, ''అకాడమీ''ల వారికి బాధ్యుడు. తృణమో పణమో డబ్బిచ్చి రచన కొనుక్కునే మహాశయుడు సాహిత్య విలువలను నిర్ణయిస్తున్నాడు. అతడికి కొంచెం నవీన భావాలుంటే నవ్య సాహిత్యాన్ని ఆదరిస్తాడు. ధనార్జన :- అదీ ముఖ్యం తొంభై శాతం రచయితలు సాహిత్యాన్ని వ్యాపారంగా మార్చివేసారు : సాహిత్య సభల నిర్వహణకూడా ఒక వ్యాపారం.

ఇంతమందిలోనూ సాంఘిక శ్రేయస్సు గురించి, క్షణక్షణం మారుతున్న జీవన విధానంగురించి, మధనపడే అమాయకుడు సక్ర తుగా ఉండవచ్చుగాని, ఆలాంటి విచిత్రజీవికి ఆదరణలేదు. (సాహిత్య రచనా బేకారులు విచ్చలవిడిగా సంచరించి, "రంధోళ్ళు" వాయిస్తూం టారు. సాహిత్య రంగానికి తామే "ట్రస్టీల" మను కుంటారు.)

*   *

"రచయిత" అనేది యివాళ "హోల్డాల్" వంటి మాట : కవులూ అనగా పద్యాలూ, గేయాలూ, పాటలూ వ్రాసేవాళ్ళూ, కేవలం వచనాన్ని ఉపయోగించి కథలూ, కధానికలూ, అల్పికలూ, గల్పికలూ, నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ, ఆర్లేవాళ్ళూ-అందరూ రచయితలే.

ఇది పరిశోధనా వ్యాసం కాదు. పరిశీలనా వ్యాసం. దీనినే ప్రాతి పదికగా చేసుకొని, ఇందులోని భావాలను, సవాల్ చేసేవారికి సమాధా నంగా, వెయ్యి పేజీల పరిశోధనా గ్రంథాన్ని వ్రాయడానికి భవదీయుడు సిద్ధంగా ఉన్నాడు: శ్రమ శక్తికి సముచితధర చెల్లించేవాళ్ళు ముందుకు రావాలి.

ఇంతకూ-"మారుతున్న విలువలు" అంటే ఏమిటి? సాంఘిక జీవన విధానం, ఆర్థిక వ్యవస్థ, రాజకీయ పరిణామాలు - మొదలైన వాటినన్నింటినీ సమీకృతం చేయగా తయారయే కొత్త పదార్థం.

